శ్రీః

శ్రీకవిరాజ కవిరాజేన విరచితమ్

# శ్రీరాఘవపాణ్డవీయమ్

శ్రీప్రేమచన్ద్రతర్కవాగీశభట్టాచార్యవిరచితా

కవాటవిపాటికావ్యాఖ్యా



ప్రకాశకులు

శ్రీమతి రావి కృష్ణకుమారీ, మోహనరావు దంపతులు

510, Pride Block Platinum County, Opp: Hosanna Mandir,

Gorantla, GUNTUR ` 522 034. A.P. State

శ్రీః

శ్రీకవిరాజ కవిరాజేన విరచితమ్

# శ్రీరాఘవపాండవీయమ్

శ్రీప్రేమచన్ద్రతర్కవాగీశభట్టాచార్యవిరచితా

కవాటవిపాటికావ్యాఖ్యా

అవతారికా

శ్రీగరిమెళ్ళ సోమయాజులు శర్మ


ప్రథమముద్రణ : 1892

ద్వితీయముద్రణ : **శ్రీరామనవమి - 2021**

ప్రతులు : 200

పుటలు : 344

వెల రూ. : 200/-


 **R. Mohan Rao**

510, Pride Block Platinum County,

Opp: Hosanna Mandir,

Gorantla, GUNTUR ` 522 034. A.P. State

**Cell : 9440115411**



**D.T.P. by :**

**P.PARVATHI**

**Cell : 74165 86775**

**Printed at :**

**Karshak Art Printers**

**HYDERABAD**

శ్రీరస్తు.

శ్లో॥ కవిరాజమవిజ్ఞాయ కుతః కావ్యక్రియాదరః ।
కవిరాజం చ విజ్ఞాయ కుతః కావ్యక్రియాదరః ॥

ఇత్యాది శ్రీవామనాది ప్రాచీనాలంకారికోపలాలన సుభగనిజకవితా
కౌముదీవికాసేన కవిసార్థసార్థకీకృత నిజాభిధానేన
శ్రీకవిరాజకవిరాజేన విరచితమహాత్ప్రసాదమమలమిదం

# శ్రీరాఘవపాణ్డవీయాఖ్యమ్.

కావ్యరత్నం.

శ్రీపురం సదాదూర్ - రంగనాథాచార్య్యైః శ్రీకైరవిణీపురవాస్తవ్యైః
సకలసుకవిజనస్తవ్యైః, శ్రీమద్దొట్టారిమ్మడి తిరునిన్రయూర్
అర్ధాంకి తిరుమలలక్ష్మీనృసింహాచార్య
కుమారతాతాచార్య్యైశ్చ
శ్రీప్రేమచన్ద్రతర్కవాగీశ భట్టాచార్యవిరచితయా కవాటవిపాటికాఖ్యయా వ్యాఖ్యయా సాకం లేఖకప్రమాదాదిజనిత
దోషరహితం పరిష్కృతం

వత్తి - రామానుజనాయకవర్య తనయాధిష్ఠితే
శ్రీనికేతనముద్రాలయే ముద్రితంచ సత్.

విజేజీయతామ్.

అస్య మూల్యం॥ ద్వాదశకలాః.

1892.

ఓం

శ్రీరామచన్ద్రాయ నమః

# అవతారిక

**శ్లో॥ నిశ్శ్రేణ్యౌ బ్రహ్మలోకస్య వాగ్దేవ్యాః కర్ణకుండలే ।**
**ధర్మద్రుమమహామూలౌ వాల్మీకివ్యాసయోః కృతీ ॥**

శ్రీ వాల్మీకివ్యాసమహర్షులు రచించిన శ్రీమద్రామాయణ - మహాభారతములు బ్రహ్మగారి సత్యలోకమునకు నిచ్చెనలు. శ్రీసరస్వతీదేవిచెవులకు రత్నకుండలములు. ధర్మవృక్షమునకు మహామూలములు - **కవిరాజు రాఘవపాండవీయము.**

**శా॥ లోకత్రాణరతిం దదాదిమమహీలోకప్రవేశోత్కభా**
**షాక్లప్త ప్రథమద్వితీయపదగుంజన్మంజుమంజీరగ-**
**ర్జాకల్పామలరామభారతకథాసర్గంబులన్ మించు వా**
**ల్మీకివ్యాసులఁ గొల్చెదన్ దదుభయశ్లేషార్థసంసిద్ధికిన్.**

లోకమునందలి జనులను రక్షింపఁగోరి శ్రీ సరస్వతీదేవి బ్రహ్మలోకమునుండి భూలోకమునకు దిగుటకై కుడికాలు ముందుపెట్టి యవతరించినది. ఆమె కుడికాలి యందున్న యందె మువ్వల సవ్వడి వంటి కావ్యము శ్రీమద్రామాయణము. ఆమె యెడమ కాలి ముంజుమంజీర గర్జల వంటి కావ్యము శ్రీమన్మహాభారతము. అట్టి గొప్ప కావ్యములను సృష్టించిన శ్రీ వాల్మీకి వ్యాసులను వారిద్దఱను గలుపుటకై నమస్కరించెదను - **పింగళి సూరన్న - రాఘవపాండవీయము.**

## అనేకార్థకావ్యములు

సంస్కృతవాఙ్మయము సకలవిద్యలకు నాకరమైనట్లే యనేకార్థకావ్యములకుఁ గూడ గని. గీర్వాణభాషలో ద్వ్యర్థికావ్యములు మొదలుకొని శతార్థకావ్యములవఱకు ననేక గ్రంథములు వెలసినవి.

## ద్విసంధానకావ్యములు

రెండర్థములతోఁ గూడిన వానికి ద్వ్యర్థికావ్యము లని పేరు. వీనికే ద్విసంధానకావ్యము లని కూడ వ్యవహారము. సంస్కృతభాషలో ద్విసంధాన కావ్యము లెక్కువగా నున్నవి.

**1. రాఘవపాండవీయము - దండి (7 శ) :**

1. దశకుమార చరిత్రము, 2. అవంతీసుందరీకథ, 3. కావ్యాదర్శము రచించిన దండి మహాకవి, సుప్రసిద్ధుఁడు. ఇతఁడు రాఘవపాండవీయమను ద్విసంధాన కావ్యమును రచించినట్లు భోజమహారాజు శృంగారప్రకాశములోఁ జెప్పినాఁడు. 'దండినో ధనంజయస్య వా ద్విసంధానే' - 'రామాయణమహాభారతయోర్దండి ద్విసంధానమివ॥' ఒక శ్లోకమును గూడ నుదహరించినాఁడు-

శ్లో॥ ఉదారమహిమారామః ప్రజానాం హర్షవర్ధనః ।
ధర్మప్రభవ ఇత్యాసీత్ ఖ్యాతో భరతపూర్వజః ॥

ఈ కావ్యము నేఁడు లభింపదు.

**2. రాఘవపాండవీయము – ధనంజయుఁడు (10శ) :**

అనేకార్థనామమాల యను నామాంతరము గల ధనంజయనిఘంటువును రచించిన ధనంజయుఁడు ప్రసిద్ధుఁడు.

**శ్లో॥ ద్విసంధానే నిపుణతాం సతాం చక్రే ధనంజయః ।**
**యయా జాతం ఫలం తస్య సతాం చక్రే ధనంజయః ॥**

అను శ్లోకమును రాజశేఖరుఁడు చెప్పినట్లు జల్హణుని సూక్తిముక్తావళి తెలుపుచున్నది. ధనంజయుని రాఘవపాండవీయములో 18 సర్గములు గలవు. ఇందు రామాయణ – భారత కథలు రెండును **జైనధర్మానుసారము**గా జోడింపఁబడినవి. ఈ కావ్యము బొంబాయి కావ్యమాలలో 1895లోఁ బ్రకటింపఁబడినట్లు తెలియుచున్నది.

**3. రాఘవపాండవీయము – కవిరాజు (12 శ) :**

ఇది ప్రస్తుతము పాఠకుల కరకమలముల నలంకరించిన కావ్యము. దీనిని గూర్చి తరువాత విస్తరముగా వివేచింతును.

**4. పార్వతీరుక్మిణీయము – విద్యామాధవుఁడు (12 శ) :**

విద్యామాధవుఁడు చాళుక్యసోమదేవుని (1126–1138) యాస్థానకవి. ఈ కావ్యములో శ్రీపార్వతీశివులకల్యాణము, శ్రీరుక్మిణీకృష్ణులవివాహము వర్ణింపఁబడినవి. బాణ–సుబంధు – కవిరాజుల తరువాతఁదానే వక్రోక్తి నిపుణుఁడ నని విద్యామాధవుఁడు చెప్పుకొనినాఁడు. ఇతఁడు కవిరాజునకు సమకాలికుఁడు. విద్యామాధవుఁడు భారవి కిరాతార్జునీయమునకు వ్యాఖ్య కూడ రచించినాఁడు.

**5. రామకృష్ణవిలోమకావ్యము – దైవజ్ఞసూర్యకవి (16 శ) :**

ఈ కావ్యమొక విధముగా రాఘవయాదవీయమే. దీనిని రచించిన దైవజ్ఞసూర్యకవి పేరే యితఁడు జ్యోతిశ్శాస్త్రజ్ఞుఁడని చెప్పుచున్నది. ఇతఁడు బహుశాస్త్రకోవిదుఁడు బహుగ్రంథకర్త. 1. నృసింహ చంపువు 2. కామతంత్ర కావ్యము 3. కంసవధ నాటకము 4. లీలావతీ టీక 6. బీజగణిత టీక 7. కవికల్పలతావ్యాఖ్య – బాలబోధిక 8. భగవద్గీతా వ్యాఖ్య – పరమార్థప్రప మొదలగునవి సూర్యకవి యితర రచనలు.

రామకృష్ణ విలోమకావ్యములో నవతారికాశ్లోకములు 7, సమాప్తి శ్లోకములు 2 కాక 36 అనులోమవిలోమశ్లోకములు గలవు.

**శ్లో॥ తమ్ భూసుతాముక్తిముదారహాసం వందే యతో భవ్యభవం దయాశ్రీః ।**
**శ్రీయాదవమ్ భవ్యభతో యదేవం సంహారదాముక్తిముతాసు భూతమ్ ॥**

అనునది మొదటి శ్లోకము.

శ్లో॥ లంకారంకాగారాధ్యాసం యానేమేయాకారావ్యాసే ।
సేవ్యారాకాయామేనేయా సంధ్యారాగాకారంకాలమ్ ॥

అనునది చివరి శ్లోకము. అన్ని శ్లోకములందు ననులోమవిలోమపాఠము సమానము. అనఁగాఁ బైనుండి క్రిందికిఁ జదివినను, క్రిందినుండిపైకిఁ జదివినను నదే శ్లోకము వచ్చును. ప్రతి శ్లోకమునకు శ్రీరామకథాపరముగా, శ్రీకృష్ణకథాపరముగా రెండర్థములు వచ్చును. అనుష్టుప్ - ఇంద్రవజ్రా - రథోద్ధతా - విద్యున్మాలా - శాలినీ వృత్తములు వాఁడబడినవి.

రామకృష్ణవిలోమకావ్యమునకు సూర్యకవియే స్వయముగా వ్యాఖ్య రచించినాఁడు. దీని కనేక సంస్కరణములు గలవు. మిత్రులు, బహుగ్రంథకర్తలు బ్రహ్మశ్రీ మేళ్ళచెర్వు వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రిగారు 'ద్విరసన' యను నాంధ్రవ్యాఖ్యాను గూర్చినారు. దీనిని శ్రీ రామోరా గారి యార్థిక సాహాయ్యముతో సాధనగ్రంథమండలి వారు ప్రకటించినారు. (25.10.2003).

**6. రాఘవయాదవీయము - చిదంబరకవి (16 శ) :**

అనేకార్థకావ్య కర్తలలోఁ జిదంబరకవికి విశిష్టస్థానము గలదు. ఇతఁడు ద్విసంధాన - త్రిసంధాన - పంచసంధాన కావ్యములను నిర్మించిన మహాకవి. చిదంబరకవిని గూర్చి శ్రీబిరుదరాజు రామరాజుగా రెక్కువగా వివరించినారు (Contribution of Andhra to Sanskrit Literature - pages 111-115).

చిదంబరకవి తాతగారు సూర్యనారాయణయజ్వ. వేంకటాంబా - అనంతనారాయణులు మాతాపితరులు. వీరు కౌశిక గోత్రజులు. చిదంబర కవి విజయనగరమహారాజగు వేంకటపతి రాయల (1586-1614) యాస్థానము నలంకరించిన విద్వత్కవి. 1. చిదంబర విలాసము 2. భాగవత చంపువు 3. శ్లేషచింతామణి 4. శబ్దార్థచింతామణి 5. రాఘవపాండవ యాదవీయము 6. పంచకల్యాణ చంపువు మొదలగునవి చిదంబరకవి కావ్యములు.

శబ్దార్థచింతామణియే రాఘవయాదవీయము. దీనిలో రామాయణకథ - భాగవతకథ జోడింపఁబడినవి.

శ్లో॥ యద్యేకదా వీక్షితుమాత్తయత్నం - రామాయణమ్ భాగవతం చాపి రమ్యమ్ ।
చిత్రమ్ బుధా యాన్తు చిదమ్బరీయం - శబ్దార్థచిన్తామణిమాప్తశస్తిమ్ ॥

దీనిపై గ్రంథకర్తయే '**నికషోపల**' వ్యాఖ్యను నిబంధించినాఁడు.

శ్లో॥ అత్యర్థస్ఫురణోపపాది సుతరామాబిభ్రతోఽనర్ఘతా
మోజః స్ఫూర్త్యుపకల్పనాతిసరలాదుత్తేజనా శిల్పతః ।
చిత్రం సారమిదం చిదంబరకవేః శబ్దార్థచింతామణేః
వ్యాఖ్యానం 'నికషోపలా' ఖ్యమనఘం విద్వన్ముదే కల్పతామ్ ॥

ఈ కావ్యము శ్రీతిరుపతికేంద్రీయవిద్యాపీఠము వారిచేఁ బ్రకటింపఁబడినట్లు జ్ఞాపకము.

**7. రాఘవయాదవీయము – వేంకటాధ్వరి (17 శ) :**

వేంకటాధ్వరిని గూర్చి – అనులోమ – విలోమ రాఘవయాదవీయ పీఠికలో విస్తరముగా వివరించితిని. విశ్వగుణాదర్శచంపూకావ్యకర్తగా వేంకటాధ్వరి సాహితీరసికులకు సుపరిచితుఁడు. ఇతఁడు రచించిన లక్ష్మీసహస్రము స్తోత్రకావ్యములలో సుప్రసిద్ధమైనది. 1. ఆచార్యపంచాశత్తు 2. లక్ష్మీసహస్రము 3. శ్రవణానందము 4. ఉత్తరకాండచంపువు 5. వరదాభ్యుదయచంపువు 6. విశ్వగుణాదర్శచంపువు 7. ప్రద్యుమ్నానందనాటకము 8. సుభద్రాపరిణయ నాటకము 9. శృంగారదీపభాణము 10. గాథాసహస్రానువాదము 11. సుభాషితకౌస్తుభము 12. రాఘవయాదవీయము 13. మహాభాష్యస్ఫూర్తి 14. యఙ్లుక్ ప్రకాశిక 15. మణిసారఖండనము 16. వ్యుత్పిత్సుబోధ 17. న్యాయపద్మము 18. మీమాంసామకరందము 19. విధిత్రయపరిత్రాణము 20. నయద్యుమణిదీపిక 21. యతిప్రతివందనఖండనము మొదలగునవి యీ విద్వత్కవి రచనలు. వేంకటాధ్వరి రచించిన రాఘవయాదవీయ మనులోమవిలోమకావ్యము. శ్లోకమును మామూలుగాఁ బైనుండి క్రిందికిఁ జదివినచో రామాయణకథ; క్రిందినుండి పైకిఁ జదివినచోఁ బారిజాతాపహరణ కథ వచ్చును. దీనిలో 30 శ్లోకములు గలవు. 30 శ్లోకములు విలోమ పద్ధతిలో వచ్చును.

శ్లో॥ వందేఽహం దేవం తం శ్రీతం, రంతారం కాలం భాసా యః ।
రామో రామా ధీరాప్యాగో, లీలామారాయోధ్యే వాసే ॥

ఇది మొదటి శ్లోకము. అనులోమము. **శ్రీరామపరము.**

శ్లో॥ సేవాధ్యేయో రామాలాలీ, గోప్యారాధీ మారామోరాః ।
యస్యాభాలంకారం తారం, తం శ్రీతం వందేఽహం దేవమ్ ॥

ఇది విలోమశ్లోకము. **శ్రీకృష్ణపరము.**

దీనిపై గ్రంథకర్త రచించిన స్వోపజ్ఞవ్యాఖ్య గలదు. ఈ రాఘవయాదవీయము నేను రచించిన 'హరిప్రియా'వ్యాఖ్యతో శ్రీరావిమోహనరావు గారిచే 2012లోఁ బ్రకటింపఁబడినది.

**8. రాఘవయాదవీయము – వసుప్రహరాజకవి (18 శ) :**

ఈ కవి యుత్కల (ఒరిస్సా) దేశీయుఁడు. ఇతఁడు రచించిన రాఘవయాదవీయములో 10 సర్గములు, 294 శ్లోకములు గలవు. శ్రీరామ – శ్రీకృష్ణ కథలు చెప్పఁబడినవి. ఈ కావ్యమిటీవల భారతీయవిద్యాప్రకాశనము – కాశీ వారిచేఁ బ్రకటింపఁబడినది. '**వసుప్రక్రియ**' యను పాణినీయ వ్యాకరణగ్రంథము వసుప్రహరాజు రెండవ కృతి.

**9. రాఘవయాదవీయము – వింజమూరి సోమేశ్వరకవి (18 శ) :**

ఇతఁడు గౌతమగోత్రుఁడు. కృష్ణసూరి పుత్త్రుఁడు. ద్వివేది గోవిందపండితుని శిష్యుఁడు. 18వ శతాబ్దమునకుఁ జెందినవాఁడు. ఈ కవి రచించిన రాఘవ యాదవీయము ద్వ్యర్థి కావ్యము

లలో మిక్కిలి పెద్దది. దీనిలో 15 సర్గములు గలవు. 7వ సర్గము లుప్తమైనది. తక్కిన 14 సర్గములలో 1128 శ్లోకములు గలవు. సప్తమ సర్గము కూడ లభించినచో మొత్తము 1200 శ్లోకముల బృహత్కావ్యమగును. ఇందు వివిధ వృత్తములు ప్రయోగింపఁ బడినవి. ప్రతి సర్గాంత శ్లోకమునందు 'శ్రీ' వర్ణ ప్రయోగము గలదు. అనఁగా మాఘమహాకవి 'శిశుపాలవధము'వలె నిది శ్రీవర్ణాంక కావ్యము.

శ్లో॥ శ్రీమానఘాంతోఽహిమభానువంశ–వనీవసంతస్సదయస్సరామః ।
కృష్ణో విదేహాత్మజయాన్వితోఽర్వ్యాం – నేతా కృతిమ్ మే సఫలీకరోతు ॥

దీనిలో సంస్కృతకవి క్షుణ్ణములగు ననుష్టుప్పు, ఉపజాతి, వసంతతిలకము మొదలగు చిన్నవృత్తములే కాక శిఖరిణి, శార్దూలము, స్రగ్ధర మొదలగు పెద్ద వృత్తములు కూడ వాఁడబడినవి.

శ్లో॥ వర్యశ్రీకృతధర్మసుస్థిరశమన్యంచద్విశాం కృచ్ఛ్రహా
కృష్ణోరాస్ఫుటమిత్రమః సరభసః శక్రః సజిష్ణుర్ధరామ్ ।
సో రామః సహ దివ్యసాగరకవీః సంబధ్యయోఽ(బ్జాననా)
నారీ భావగతో కృతైష సమహాహాలో ఖరాం చాహనా ॥ (15–53)

ఇది చక్రబంధము. ఈ విషయము ముద్రిత ప్రతిలో లేదు. ఇందలి పాఠము సరిగా లేదు. దీనిలో రెండు, మూఁడు సవరణలు గావించినచోఁ జక్రములో నిముడును. మూఁడవ పాదములోఁ జివర రెండక్షరములు లోపించినవి. (బ్జా(ననా) కావచ్చునని యూహించితిని. ఇందలి మూఁడవ వలయములోని యక్షరములను గలిపినచో 'శ్రీరామకృష్ణ (ష్ణు) యోః' – అని వచ్చును. దీని తరువాత నొక స్రగ్ధరతోఁ గావ్యము ముగియుచున్నది. ఈ రాఘవయాదవీయకావ్యము శ్రీచిలుకూరి పాపయ్యశాస్త్రిగారి సంపాదకత్వములో నాంధ్రసాహిత్యపరిషత్తువారు కాకినాడ నుండి 1950లోఁ బ్రచురించినారు.

ఇవి కాక 1. రఘునాథాచార్యులు 2. శ్రీనివాసాచార్యులు 3. వాసుదేవకవి రచించిన రాఘవయాదవీయములున్నట్లు శ్రీమాడభూషి కృష్ణమాచార్యులు గారు చెప్పుచున్నారు. కాని యవి ముద్రింపఁబడినట్లు లేదు.

**10. రాఘవనైషధీయము – హరదత్తసూరి (18 శ) :**

హరదత్తుఁడు గర్గ గోత్రీయుఁడు. జ్యోతిశ్శాస్త్రపండితుడగు జయశంకరుని కుమారుఁడు. ఈ కావ్యములో రామాయణకథ, నలచరిత్ర జోడింపఁబడినవి. దీనిలో రెండు సర్గములు గలవు. మొదటి సర్గములో 126 శ్లోకములలోఁ బ్రధాన కథలు చెప్పఁబడినవి. ఇదియే ప్రధానమైనది. రెండవ సర్గములో 20 శ్లోకములలో ఋతువర్ణనము గలదు. దీనిపై గ్రంథకర్తయే విస్తృత వ్యాఖ్యను రచించినాఁడు. ఇతఁడు వ్యాఖ్యలో శ్రీభట్టోజీదీక్షితుల నుదాహరించుటచే నితని కాలము 18 వ శతాబ్దము.

శ్లో॥ దశరథ ఇతి నామ్నా వీరసేనః క్షితీశః – క్షితితలవిబుధానాం వందథుః ప్రాగ్బభూవ ।
గురుకవిబుధజోషః సామృతో నారదాఢ్యః – సతి నరపతిరత్నే మర్త్యలోకోఽప్యనాకీత్ ॥

ఇది ప్రారంభశ్లోకము.

శ్లో॥ గర్గర్షివంశతిలకో జయశంకరాఖ్యో – జ్యోతిర్విదామ్ ప్రణయకృత్ సుకవీంద్రమాన్యః ।
ఆధ్యాత్మికావగతిశాంతిపరాయణోఽభూద్ – ధర్మోపదేశనపటుర్నయబోధ ఆసీత్ ॥

శ్లో॥ తత్సూను ర్వరదత్త ఇత్యమలధీః శ్రీమత్ఫణీంద్రోదితే
భాష్యే పాటవతః ప్రథామధిగతశ్ఛందశ్శ్రుతీనామ్ బుధః ।
సాహిత్యార్ణవ మంథనైక.... .... .... ....

దీనిలోఁ గొన్ని శ్లోకములు శిథిలము లైనవి. అవి చుక్కల గుర్తులతో ముద్రింపఁబడినవి.

**11. నలహరిశ్చంద్రీయము – కాళిదాసు (?) :**

ఇది కూడ వేంకటాధ్వరి రాఘవయాదవీయమువలె **ననులోమ – విలోమకావ్యము**. శ్లోకమును మామూలుగా ననులోమపద్ధతిలోఁ బైనుండి క్రిందికిఁజదివినచో నలోపాఖ్యానము వచ్చును. అదే శ్లోకమును విలోమపద్ధతిలోఁ గ్రింది నుండి పైకిఁ జదివినచో హరిశ్చంద్రోపాఖ్యానము వచ్చును.

శ్రీమద్భాగవతపీఠికయగు సిద్ధాంతచంద్రికలో శ్రీదంపూరి వేంకటసుబ్బాశాస్త్రిగారిట్లు చెప్పినారు–

తేనైవ కవిజనసార్వభౌమేన **కాళిదాసేన** విరచితహరిశ్చంద్రనలోపాఖ్యానే– అథానులోమ్యేన దమయంతీ చంద్రోదయే వ్యసనవతీ జాతేత్యర్థంచ ప్రాతిలోమ్యే చంద్రమతీ హరిశ్చంద్రేణ గర్భమ్ ప్రాపితేత్యర్థం చ ప్రతిపాదయన్నాహ –

శ్లో॥ తాపితా హిమధామ్నాభూ త్తదాలోకనకామనా ।
సాధవేతి కృతాధీతా రుచాతీవ మహైనసా ॥

టీకా : తస్య నలస్య ఆలోకనే వీక్షణే ఆశా యస్యాస్సా తథోక్తా భైమీ హిమధామ్నా చంద్రేణ – అధవేతి కృతా అధవానామ్ ప్రోషితభర్తృకాణామ్; ఈతిముపద్రవం కరోతీతి కృత్ తయా । అత ఏవ అతీవ మహైనసా అత్యంతమహాపాతకవత్యా – అనాథస్త్రీవధాదితి భావః । **కలుషం వృజినైనోఽఘమ్**' ఇత్యమరః । రుచా చంద్రికయా తాపితా సతీ – ఆధీతా (ఆధి+ఇతా) మనోవ్యాధిమ్ । ప్రాప్తాభూత్ । '**పుంస్యాధిర్మానసీ వ్యథా**' ఇత్యమరః । అత్ర తదాలోకనకామనేత్యనేన సంకల్పాఖ్యా తృతీయావస్థా సూచితా । హిమధామ్నా ఆధీతేత్యనేన అభిహితా నిద్రాభావాజ్జాగరాఖ్యా తురీయావస్థా ॥

ప్రాతిలోమ్యేతు –

శ్లో॥ సా న హైమవతీ చారుతాధీతా కృతివేధసా ।
నామకా నకలోదాత్త భూమ్నా ధామహితాపితా ॥

టీకా : హిమవతః అపత్యం స్త్రీ హైమవతీ। సేవ చారుతయా। సౌందర్యేణ అధీతా ప్రాప్తా నామః మనః కేళిరసః యస్యాః సా నామకా కులాంగనోచితా లజ్జావతీతి భావః। హితానుకూలా సా చంద్రమతీ ఆకృతౌ ఆకారే వేధసా విష్ణుతుల్యేన '**వేధా విష్ణౌ చ ధాతః**' ఇతి శాశ్వతః। యద్వా – ఆకృతి వేధసా కార్యేషు బ్రహ్మతుల్యేన – అఘటనఘటనా దక్షేణేత్యర్థః। కలాసు – విద్యాసు ఉదాత్తభూమ్నా మహనీయమాహాత్మ్యేన హరిశ్చంద్రేణ। ధామతేజః – గర్భోత్పాదకం వీర్యమిత్యర్థః। ఆపితా ప్రాపితా నేతి న గర్భిణీ కృతేత్యర్థః ॥

అస్మిన్నేవ కావ్యే – ఆనులోమ్యే–

శ్లో॥ కంకమైత్తనుసాదం సా, ప్రసవేషు సునందనమ్।
నాజలా బిసవల్లీవ, సితాకాంతిరధీరధీః ॥

ప్రాతిలోమ్యేతు–

శ్లో॥ ధీరధీరతికాంతాసి, వల్లీవ సబిలా జనా।
నందనం సుషువే సప్ర, సాదం సానుత్తమైకకం ॥

**ఇది నలహరిశ్చంద్రోపాఖ్యానము గాని హరిశ్చంద్రనలోపాఖ్యానము గాదు.**

శ్రీసురేశచంద్రబెనర్జీ గారు Kalidasa Epocrypha అను గ్రంథములోఁ గాళిదాసు పేరు మీఁదుగా వచ్చిన గ్రంథములలో నలహరిశ్చంద్రీయమును బేర్కొనలేదు.

శ్రీమాడభూషి కృష్ణమాచార్యులు నలహరిశ్చంద్రీయ మజ్ఞాత కర్తృక మని చెప్పి రెండు శ్లోకముల నుదాహరించినారు–

శ్లో॥ నిజమోఽతి ప్రజానారీ, నలోఽచ్ఛస్సదమోఽజని।
యః శ్రియశ్చంద్ర ఇంద్రశ్చ, గోప్తా గోస్సర్వపూరిహ ॥

ఇది నల పక్షములో ననులోమపాఠము.

శ్లో॥ హరిపూర్వస్సగోప్తా గోశ్చంద్ర ఇంద్రశ్చయః శ్రియః।
నిజమోదస్సచ్ఛలోన రీనాజాప్రతిమోఽజని॥

అని హరిశ్చంద్రపక్షములో విలోమపాఠము.

శ్లో॥ లీలాకలోమధ్యమలోకలాలీ– త్యాగీ సుఖీ ముగ్ధముఖీ సు గీత్యా।
సభాప్రయానంగనయా ప్రభాస – సహాసయా తత్ర తయా సహా స ॥

ఇది చివరి శ్లోకము. దీని ననులోమ – ప్రతిలోమపాదము, **పాదభ్రమకము**నని కూడ నందురు.

ఈ కావ్యము ముద్రితమో కాదో తెలియదు. వేంకటాధ్వరి రాఘవయాదవీయమునకీ నలహరిశ్చంద్రీయమే ప్రేరకమై యుండును.

**12. హరిశ్చంద్రోదయము – అనంతసూరి :**

ఇది కూడ రెండర్థములు గల ద్వ్యర్థికావ్యము. 20 సర్గములు గల పెద్దకావ్యము. దీనిలో 1. హరిశ్చంద్రోపాఖ్యానము. 2. కవిపోషకుఁడగు హరిశ్చంద్ర నృపతి చరిత్ర జోడింపఁబడినవి.

# శ్రీరాఘవపాణ్డవీయమ్

## త్రిసంధానకావ్యములు

త్రిసంధానములు లేక త్ర్యర్థికావ్యములు. 3 అర్థములు గలవి.

**1. రాఘవ పాండవ యాదవీయము – చిదంబరకవి (16శ ) :**

చిదంబర కవిని గూర్చి ముందే చెప్పితిని. ఈ కావ్యములోఁ బ్రతి శ్లోకమునకు 1. రామాయణ పరముగా, 2. భారతపరముగా, 3. భాగవత పరముగా మూఁడర్థములు వచ్చును.

శ్లో॥ విధాయ కమలేక్షణం విశదసారసారస్వత–
ప్రవాహవరభూషణం హృది సుభాసి వాగీశ్వరమ్ ।
కరోతి పరమాలసత్సురసభాసురార్థం జయత్
కథాత్రయి చిదంబరః ప్రతనుకావ్యరత్నమ్ బుధః ॥

దీనిలో 3 సర్గములు 155 శ్లోకములు గలవు. ఈ విషయమును గవియే యిట్లు చెప్పినాఁడు–

శ్లో॥ పంచాశచ్చ శతం చ పద్యమణయః పంచాపి కించాతులాః
పుణ్యా రాఘవపార్థకృష్ణవిషయా వర్ణ్యాః ప్రసిద్ధాః కథాః ।
చిత్రే వర్ణనయా చిదంబరకవేర్యత్కావ్యరత్నే కృతా
కుత్ర స్యాదవలోకయంతు కుశలాస్సారళ్యమేతాదృశమ్ ॥

ఈ కావ్యముపైఁ జిదంబరకవి తండ్రి యగు ననంత నారాయణుఁ 'డర్థదీపిక' యను విస్తృతవ్యాఖ్యను నిబంధించినాఁడు.

శ్లో॥ శ్రీమత్కౌశికవంశవారిధివిధోః శ్రీసూర్యనారాయణాత్
సంజాతః సకలాగమాతిచతురో యోఽనంతనారాయణః ।
స వ్యాఖ్యాతి సుతేన బాల్యవయసి ప్రాప్తేశ్వరానుగ్రహ–
ప్రాచుర్యేణ చిదంబరేణ రచితం సత్కావ్యరత్నం సుధీః ॥

శ్లో॥ సారం భావిబుధాస్సుధారసధరం రామాయణమ్ భారతం
సారమ్ భాగవతం చ కించ సరసా యద్యేకదా వీక్షితుమ్ ।
ప్రజ్ఞాతుం చ పదప్రపంచవిభవం సర్వం తు కుర్వంతు తే
ప్రజ్ఞాతుంగహృదశ్చిదంబరకవేః సత్కావ్యరత్నం హృది ॥

ఇందలి 75 శ్లోకములు గల ప్రథమసర్గము సవ్యాఖ్యానముగా వావిళ్ళవారిచే 100 సంవత్సరములకు ముందే ప్రకటింపఁబడినది. దీని శిథిలప్రతి యిప్పటికి నా దగ్గఱ భద్రముగా నున్నది.

**2. రాఘవయాదవపాండవీయము – రాజచూడామణిదీక్షితులు (17 శ) :**

ఇతని తండ్రి రత్నఖేట శ్రీనివాసదీక్షితులు. తల్లి కామాక్షి. అన్న యగు నీశ్వరయజ్వ సకల విద్యాగురువు. తంజావూరు రఘునాథభూపాలుఁడు (క్రీ.శ.1614) ఆశ్రయప్రదాత. ఇతఁడు వివిధ శాఖలలో బహుగ్రంథములు నిర్మించిన విద్వత్కవిచూడామణి.

1. యజుర్వేదవ్యాఖ్య, 2. ఉపనిషద్ వ్యాఖ్య, 3. తంత్రశిఖామణి (మీమాంసాసూత్రవ్యాఖ్య), 4. తంత్రరత్నాకరము, 5. కర్పూరవర్తిక (శాస్త్రదీపికావ్యాఖ్య), 6. న్యాయముక్తావళి (సంకర్షకాండవ్యాఖ్య), 7. ప్రాయశ్చిత్తప్రదీపిక, 8. మణిదర్పణము (తత్త్వచింతామణివ్యాఖ్య), 9. న్యాయచూడామణి (రుచిదత్త గ్రంథవ్యాఖ్య), 10. కావ్యదర్పణము, 11. అలంకారచూడామణి, 12. చిత్రమంజరి, 13. సాహిత్యసామ్రాజ్యము, 14. వృత్తరత్నావళి, 15. యుద్ధకాండచంపువు, 16. భారతచంపువు, 17. రామకథ, 18. శంకరాభ్యుదయము, 19. రుక్మిణీకల్యాణము, 20. రఘునాథాభ్యుదయము, 21. రత్నఖేటవిజయము, 22. కంసవధ, 23. ఆనందరాఘవనాటకము, 24. కమలినీ కలహంస నాటిక, 25. శృంగారసర్వస్వభాణము మొదలగునవి యితని కృతులు. **రాఘవయాదవపాండవీయమ**ను త్ర్యర్థికావ్యమును గూడ రచించినాఁడు.

శ్లో॥ రఘువీరస్య కృష్ణస్య పాండవానాం చ యాః కథాః ।
ప్రత్యక్షరశ్లేషమయైః పద్యైర్భ్యైరవర్ణయత్ ॥ – కావ్యదర్పణము.

**3. యాదవరాఘవపాండవీయము – అనంతాచార్యుఁడు :**

ఇతఁడు మైసూరు రాష్ట్రమునందలి 'యుదయేంద్రపుర' వాస్తవ్యుఁడు. ఈ కావ్యములో భాగవత – రామాయణ – భారత కథలు మూఁడును గలవు.

**4. నలహరిశ్చంద్రయాదవీయము – ఘనశ్యాముఁడు :**

దీనిలో నలోపాఖ్యానము, హరిశ్చంద్రోపాఖ్యానము, శ్రీకృష్ణచరిత్ర కలిసినవి.

ఈ చివరి రెండు కావ్యములను శ్రీమాడభూషి కృష్ణమాచార్యులు పేర్కొనినారు.

సంస్కృతములో నల–రాఘవ–పాండవ–యాదవీయము వంటి చతుస్సంధాన కావ్యములున్నవో లేవో తెలియదు.

### పంచసంధానకావ్యములు

**పంచకల్యాణచంపువు – చిదంబరకవి (16 శ) :**

ఈ కావ్యములో రెండు స్తబకములు గలవు. ప్రతిశ్లోకమునకు 5 అర్థములు వచ్చును. 1. శ్రీరామ, 2. శ్రీకృష్ణ, 3. శివ, 4. విష్ణు, 5. సుబ్రహ్మణ్య కల్యాణములు వర్ణింపఁ బడినవి.

శ్లో॥ వాచం ద్రాగ్వదనే సరంగసదనే వల్గత్పదాం వో మదా–
దాచంద్రార్కముదంచదంచితరసాం తన్యాద్విభుః శ్రీమతీమ్ ।
యో హారీ రుచిహారిపుష్కరకరో యోగ్యార్పితార్ఘ్యః పురో
భాస్వాన్ కర్మసు భామినీ భవతి సా యస్య ప్రభావల్లభా ॥

ఇది యారంభ శ్లోకము.

శ్లో॥ సూనోః కౌశికభూషణస్య మఖినః శ్రీసూర్యనారాయణ
క్షోణీందోరజనిష్ట కోవిదమణేర్యోఽనంతనారాయణాత్ ।

తస్యాయం స్తబకశ్చిదంబరకవేః శ్రీచంపురత్నే కృతౌ
తస్యాగాత్ ప్రథమోత్తరస్తతపదశ్రీః పంచకల్యాణకే ॥

ఇది చివరి శ్లోకము. దీనిపైఁజిదంబరకవియే 'శబ్దశాణోపల' మను వ్యాఖ్యానమును సంతరించినాఁడు.

ఈ పంచకల్యాణచంపూకావ్యము నుస్మానియా విశ్వవిద్యాలయము వారు తమ సంస్కృత పత్రికలోఁ బ్రకటించుటకు సంకల్పించిరి. కాని యింతవఱకు నాకార్యము ఫలింపలేదు.

**సప్తసంధానకావ్యములు**

**1. సప్తసంధానకావ్యము – హేమచంద్రుఁడు (1088–1174) :**

1. హైమశబ్దానుశాసనము, 2. ఛందోఽనుశాసనము 3. కావ్యానుశాసనము, 4. యోగానుశాసనము, 5.ప్రమాణమీమాంస, 6. అభిధానచింతామణి, 7. అనేకార్థసంగ్రహము, 8. నిఘంటుశేషము, 9. దేశీనామమాల, 10. లింగానుశాసనము, 11. ద్వ్యాశ్రయకావ్యము, (కుమారపాలచరితము), 12. త్రిషష్టిశలాకా పురుషచరితము, 13. స్థవిరావళీ చరితము మొదలగు గొప్ప గొప్ప గ్రంథములు రచించి '**కలికాలసర్వజ్ఞుఁ**'డను బిరుదము నొందిన హేమచంద్రుఁడు సప్తసంధానకావ్యమును గూడ రచించినాఁడఁట!

మేఘవిజయోపాధ్యాయుఁడిట్లు చెప్పినాఁడు–

శ్లో॥ శ్రీహేమచంద్రసూరీశైః, సప్తసంధానమాదిమమ్ ।
రచితం తదలాభే తు, స్యాదిదం తుష్టయే సతామ్ ॥

ఇది నేఁడు లభింపదు.

**2. సప్తసంధానకావ్యము – మేఘవిజయగణి (17 శ) :**

ఇతఁడు జైనుఁడు. ఉపాధ్యాయ బిరుదాంకితుఁడు. వ్యాకరణ–తర్క–జ్యోతిష శాస్త్రములలో మహాపండితుఁడు. మహాకవి. మేఘవిజయుని సప్తసంధానకావ్యములో 9 సర్గములు గలవు. 1. ఋషభదేవుఁడు, 2. శాంతినాథుఁడు, 3. నేమినాథుఁడు, 4. పార్శ్వనాథుఁడు, 5. మహావీరుఁడు, 6. శ్రీకృష్ణుఁడు, 7. బలదేవుఁడు (బలరాముఁడు) – వీరి చరిత్రలు శ్లేషపద్ధతిలోఁ బెనవేయఁబడినవి. ఈ కావ్యము విక్రమశకము 1727 (క్రీ.శ. 1670)లో రచింపఁబడినట్లు కవియే చెప్పుకొనినాఁడు.

1. యుక్తిప్రబోధము, 2. దేవానందకావ్యము, 3. శాంతినాథచరిత్రము, 4. దిగ్విజయకావ్యము 5. మేఘదూత సమస్యాపూరణము మొదలగునవి యితని యితర కృతులు. బనారసీదాసను హిందీకవి రచించిన '**సమయసార**'మున కనుకరణము యుక్తిప్రబోధము.

గ్రంథవిస్తరమైనను బాఠకుల వినోదమునకై యీ కవి చమత్కారశ్లోకములను కొన్నింటి నుదాహరించుచున్నాను. దేవానందకావ్యము మాఘమహాకవి శిశుపాలవధమునకు సమస్యాపూరణ కావ్యము.

శ్లో॥ అజస్రమాస్ఫాలిత వల్లకీగుణ - క్షతోజ్జ్వలాంగుష్ఠనఖాంశుభిన్నయా ।
పురః ప్రవాలైరివ పూరితార్ధయా - 'విభాంతమచ్ఛస్ఫటికాక్షమాలయా॥'

ఇది మాఘుని శ్లోకము - (శిశు - 1-9), ఇందలి నాల్గవపాదమును సమస్యగాఁ గైకొని యీ శ్లోకమును రచించినాఁడు.

శ్లో॥ అథాత్ర జంబూపపదేఽస్తి భారతమ్ - ప్రభారతం ద్వీపకులప్రదీపకే ।
మహోదయం ధ్యాయదివాస్యగంగయా - 'విభాంతమచ్ఛస్ఫటికాక్షమాలయా'॥

ఇట్లే యితని శాంతినాథచరిత్రము శ్రీశ్రీహర్షుని నైషధీయచరితమునకు సమస్యాపూరణ కావ్యము.

శ్లో॥ నిపీయ యస్య క్షితిరక్షిణః కథా - స్తథాద్రియంతే న బుధాః సుధామపి ।
నలః సితచ్ఛత్రితకీర్తిమండలః - స రాశిరాసీన్మహసామ్ మహోజ్జ్వలః ॥

శ్లో॥ రసైః కథాయస్య సుధావధీరిణీ - నలః స భూజానిరభూద్గుణాద్భుతః ।
సువర్ణదండైకసితాతపత్రిత - జ్వలత్ ప్రతాపావళికీర్తిమండలః ॥ (నైష-1-1,2)

ఇవి నైషధారంభ శ్లోకములు. ఈ శ్లోకముల యందలి పాదములను సమస్యలుగాఁ గైకొని మేఘవిజయగణి శాంతినాథచరిత్రలో నీ శ్లోకములను రచించినాఁడు.

శ్లో॥ 'నిపీయ యస్య క్షితిరక్షిణః కథా' - సురాః సురాజ్యాదిసుఖమ్ బహిర్ముఖమ్ ।
ప్రపేదిరేఽంతః స్థిరతన్మయాశయాః - సదా సదానందభృతః ప్రశంసయా ॥

శ్లో॥ యథా శ్రుతస్యేహ నిపీతతత్కథా - 'స్తథాద్రియంతే న బుధాః సుధామపి' ।
సుధాభుజాం జన్మ న తన్మనః ప్రియమ్ - భవేద్భవే యత్ర న తత్కథాప్రథా॥

శ్లో॥ శ్రియామభివ్యక్తమనోఽనురక్తతా - విశాలసాలత్రితయా శ్రియా స్ఫుటా ।
తథావభాసే స జగత్త్రయీ విభు - 'ర్జ్వలత్ప్రతాపావళికీర్తిమండలః' ॥

ఇతఁడు రచించిన మేఘదూతసమస్యాపూరణ కావ్యము కూడ నిట్టిదే. విక్రమకవి రచించిన 'నేమిదూతము', విమలకీర్తిగణి రచించిన 'చంద్రదూతము', నిత్యానందశాస్త్రి రచించిన 'హనుమద్దూతము' మొదలగునవి కూడ మేఘసందేశసమస్యాపూరణ కావ్యములే.

సప్తసంధానకావ్యము కేవలశ్లేషకావ్యము మాత్రమే కాదు. ప్రకృతివర్ణనలతోఁగూడ రంజకమైనది. గంగానది నెట్లు వర్ణించినాఁడో చూడుఁడు-

శ్లో॥ గంగానుషంగాన్మణిమాలభారిణీ - సురద్రుసేకామృతపూరసారణీ ।
క్షేత్రక్షమేశస్య రసప్రచారిణీ - సా ప్రాగుదూఢా వనితేవ ధారిణీ ॥ (- సప్తసం - 1-17)

ఈ కవి సాధారణజనజీవితములను గూడ లోఁతుగాఁ బరిశీలించినవాఁడు. రైతులను మహర్షులతోఁ బోల్చి యెట్లు వర్ణించినాఁడో పరికింపుఁడు -

శ్లో॥ రజని బహుధాన్యోచ్చై రక్షావిధౌ ధృతకంబలః
సపది దుధువే వారామారాద్ గవా గలకంబలః ।
ఋషిరివ పరక్షేత్రం సేవే కృషీవలపుంగవ-
శ్చపలసబలమ్ భీత్యా జజ్ఞే బలం చ పలాశజమ్ ॥ (- సప్తసం - 7-29)

సంస్కృతవాఙ్మయమునకు జైనకవులు చేసిన సేవ యెనలేనిది.

**దశార్థశ్లోకము**

చిదంబరకవి రచించిన రాఘవపాండవయాదవీయము నందలి -

శ్లో॥ వాచం వో రచయతు సర్వదాంతరంగే
గాంగేయస్సరసనయోదయాం దధానః ।
సత్యాప్తో బుధకులమౌళిబంధురోజః
శ్రీరామస్తుతగురుమానసాబ్జహంసః ॥

అను మంగళశ్లోకమునకు 1. బ్రహ్మ, 2. విష్ణు, 3. శివ, 4. సుబ్రహ్మణ్య, 5. శ్రీరామ, 6. బలరామ, 7. పరశురామ, 8. మన్మథ, 9. అజమహారాజ, 10. భీష్మపరముగా 10 అర్థముల ననంతనారాయణుఁడు చెప్పినాఁడు.

**శతార్థశ్లోక కావ్యములు**

**1. శతార్థకావ్యము - సోమప్రభాచార్యుఁడు (12 శ) :**

ఈ కవి జైనుఁడు. ఇతఁడొకే యొక శ్లోకమును నిర్మించి దానికి 100 అర్థముల నుట్టంకించినాఁడు. వీనిలో 24 తీర్థంకరుల చరిత్రలు సూచింపఁబడినవి. ఈ శతార్థశ్లోకమునకు వ్యాఖ్యాత కూడ సోమప్రభాచార్యుఁడే.

**2. శతార్థశ్లోకము - శ్రీవ్యాసమహర్షి (క్రీ.పూ. 3000)** :

శ్లో॥ జన్మాద్యస్య యతోఽన్వయాదితరతశ్చార్థేష్వభిజ్ఞః స్వరాట్
తేనే బ్రహ్మ హృదా య ఆదికవయే ముహ్యంతి యత్సూరయః ।
తేజో వారి మృదాం యథా వినిమయో యత్ర త్రిసర్గో మృషా
ధామ్నా స్వేన సదా నిరస్తకుహకం సత్యమ్ పరం ధీమహి ॥

ఇది శ్రీమద్భాగవతపురాణమునకు మంగళ శ్లోకము. శ్రీవంశీధరమిశ్రులీ శ్లోకమునకు 100 అర్థములు వక్కాణించినారు. ఇది సంస్కృతభాష యొక్క గొప్పతనము.

ఈ శ్లేషకావ్యములలో శిరోభూషణము వంటిది కవిరాజు రాఘవపాండవీయము.

**కవిరాజు**

ఈ కావ్యకర్త కవిరాజనుటలో వివాదము లేదు. కాని కవిరాజనునది నిజనామమా? లేక బిరుదనామమా? యనునది సందేహము. కొందఱు కవిరాజనునది బిరుదనామ మనియుఁ గవి

యసలు పేరు మాధవభట్టనియుఁ జెప్పుచున్నారు. కావ్యకర్త తాను కవిరాజసూరి నని చెప్పుకొనుటచేఁ గవిరాజనునది నిజనామమని కొందఱు భావించుచున్నారు.

శ్లో॥ వినోదహేతోః కవిరాజసూరి - ర్నిబంధనద్వంద్వమిదం విధత్తే ॥ (- రాఘ 1-35)

కాళిదాసు, పండితరాయలు మొదలగు నామములవలెఁ గవిరాజశబ్దముకూడ బిరుదనామమని నేను భావించుచున్నాను. కావ్యమీమాంసాకర్త యగు రాజశేఖరుఁడు మొదలగు వారికిఁగూడ గవిరాజను బిరుదము గలదు. కవిరాజు తండ్రి కీర్తినారాయణుఁడు. తల్లి చంద్రముఖి. కీర్తినారాయణుఁడు 'బనవాసి' రాజధానిగా నేలిన కదంబవంశజులగు రాజుల యాస్థానములో నున్నవాఁడు. కాదంబరాజగు త్రినేత్రుఁడు జయంతీపురములో శివాలయమును గట్టించి శివలింగమును బ్రతిష్ఠించినాఁడు. కవిరాజు జయంతీపురవాస్తవ్యుఁడు. కవిరాజు కర్ణాటదేశీయుఁడే యనుటకు మఱియొక యాధారము కూడఁ గలదు.

శ్లో॥ దత్తయః కీర్తయశ్చైవ యదీయాః కర్ణమార్గగాః ।
కాంతాభ్యశ్చ కవిభ్యశ్చ కామదం యస్య దర్శనమ్ ॥ (- 1-15)

దత్తి యనఁగా దానము. '**దత్తయో దానాని**' యని వ్యాఖ్య. దానశబ్దమునకుఁ బర్యాయపదముగా దత్తిశబ్దమును వాడుట కర్ణాటసాహిత్యమునందే ప్రసిద్ధము. దానశాసనములకు దత్తి శాసనములని కన్నడదేశములో వ్యవహారము. కాదంబరాజులకు రాజధాని యగు '**బనవాసి**' కన్నడదేశములోనిదే. బనవాసికి జయంతీక్షేత్రమని మఱొకపేరు.

శ్లో॥ జేతా భూమేర్జయంతీపురపురమథనశ్రీపదాంభోజభృంగః । (- రాఘవ-1-25)

కృతిభర్త యగు కామదేవుఁడు జయంతీపురములో వెలసిన శివునియొక్క శ్రీపాదపద్మములకుఁ తుమ్మెద వంటివాఁడు. కామదేవుని ప్రోత్సాహమువల్లనే కవిరాజు రాఘవపాండవీయమును రచించినాఁడు. కామదేవ మహారాజు నవతారికలో 23 శ్లోకములలో నోరార వర్ణించినాఁడు.

శ్లో॥ కస్త్రాతా? కామదేవః; సమరవిజయినాం కోఽగ్రణీః? **కామదేవః**
కస్త్యాగీ? కామదేవః; సరసకవిగిరాం కిమ్ పదం? **కామదేవః** ।
కః సేవ్యః? కామదేవః; శ్రితభరణవిధౌ కః కృతీ? **కామదేవః**
ప్రశ్నానామేవమేకః ప్రతివచనమహో! రామవత్ **కామదేవః** ॥ (- రాఘవ 1-28)

కాళిదాసు, భారవి, మాఘుఁడు మొదలగు సంస్కృతకవులు రచించిన కావ్యములలో నవతారికలుండవు. కథావస్తువుతోడనే కావ్యమారంభమగును. కన్నడ-తెలుఁగు కవులు మాత్రము కృతికర్త స్వీయవంశమును గూర్చి గాని, కృతిభర్త వంశమును గూర్చిగాని పెద్దపెద్ద యవతారికలు వ్రాసిరి. రాఘవపాండవీయములో 48 శ్లోకముల యవతారిక కలదు. ఇది కన్నడకవి సంప్రదాయమే. కవిరాజు కన్నడిగుఁడే.

### కవిరాజు కాలము

కామదేవుని రాజ్యకాలము 1182-1187. కాఁబట్టి యితని యాస్థానకవి యగు కవిరాజు కాలము కూడ 12వ శతాబ్దము.

దుర్గసింహుఁడు కన్నడ పంచతంత్రకర్త. ఇతఁడు చాళుక్యరాజగు జగదేకమల్లుని యాస్థానకవి. జగదేకమల్లుని కాలము 11వ శతాబ్దము. దుర్గసింహుఁడు పంచతంత్రములో ననేక పూర్వకవులను స్తుతించినాఁడు. దుర్గసింహుఁడు స్తుతించిన కవులందఱు వైదిక కవులే. ఒక్క రాఘవపాండవీయకర్త యగు ధనంజయుఁడు మాత్రమే జైనుఁడు. దుర్గసింహుని నాఁటికి గవిరాజు రాఘవపాండవీయ మున్నచో నతఁడు ధనంజయునకు బదులుగాఁ గవిరాజునే స్తుతించెడివాఁడు. కాఁబట్టి కవిరాజు పంచతంత్రకర్తయగు దుర్గసింహునకుఁ దరువాతి వాఁడు. ఈ విధముగాఁ జూచినను గవిరాజు కాలము 12వ శతాబ్దమని తెలియుచున్నది.

### కవిరాజు కృతులు

కవిరాజు 1. పారిజాతహరణము, 2. రాఘవపాండవీయము నను రెండు కావ్యములను రచించినాఁడు. పారిజాతహరణ కావ్యములో 10 సర్గములు గలవు. శ్రీకృష్ణుఁడు సత్యభామ కోరికపై స్వర్గము నుండి పారిజాతవృక్షమును ద్వారకానగరికిఁ దెచ్చుట యిందలి కథావస్తువు. కవిరాజు తన తండ్రి యగు కీర్తినారాయణుని మెప్పించుటకై యీ కావ్యమును రచించినాఁడు. పారిజాతహరణము కవిరాజు మొదటి కృతి.

### రాఘవపాండవీయము

ఈ కావ్యము కవిరాజు రెండవ కృతి. మిక్కిలి పరిపక్వస్థితిలో రచించిన కావ్యము. దీనిలో 13 సర్గములు. మొత్తము 673 శ్లోకములు గలవు.

"ఇతి శ్రీహరధరణీప్రసూతకాదంబకులతిలకచక్రవర్తివీరశ్రీకామదేవప్రోత్సాహిత**కవిరాజపండిత-విరచితే** రాఘవపాండవీయే మహాకావ్యే కామదేవాంకే రావణదుర్యోధనవధ - శ్రీరామయుధిష్ఠిర-రాజ్యాభిషేకో నామ త్రయోదశః సర్గః" - అనునది గ్రంథాంతగద్యము.

1. సుబాహు - బకవధము, 2. సీతా-ద్రౌపదీ స్వయంవరము, 3. రామ-యుధిష్ఠిర వన ప్రయాణము, 4. ఖరదూషణ - నివాతకవచ వధము, 5. మాల్యవద్గిరి - విరాటనగరనివాసము, 6. లంకాదహన - ఉత్తరగోగ్రహణము, 7. అంగద - శ్రీకృష్ణ దౌత్యము, 8. ప్రహస్త - భీష్మవధము, 9. కుంభకర్ణ - భగదత్త వధము, 10. అతికాయ - జయద్రథ వధము, 11. కుంభ, నికుంభ - ఘటోత్కచ, ద్రోణ వధము, 12. మేఘనాద, విరూపాక్ష - కర్ణ, దుశ్శాసన, శల్య, శకుని వధము, 13. రావణ - దుర్యోధన వధ; శ్రీరామ - యుధిష్ఠిర రాజ్యాభిషేకము నను నంశములు క్రమముగాఁ బ్రతిపాదింపఁ బడినట్లు కవియే సర్గాంత పుష్పికలలోఁ జెప్పుకొనినాఁడు.

ఈ కావ్యమునకుఁ దెలుఁగు వ్యాఖ్య లేకుండుటచేఁ బాఠకులకు సులభముగా నవగత మగుట కొఱకు నిందలి **కథాద్వయవిషయము**లను సర్గానుసారముగా సంగ్రహముగా వివరించుచున్నాను.

**కథాద్వయసంధానశ్లేషనైపుణ్యము**

**1. ప్రథమసర్గము :** (రామా) దశరథుఁడను మహారాజు కలఁడు. అతఁడయోధ్య రాజధానిగా రాజ్యము నేలుచుండెను. కౌసల్య, కైకేయి, సుమిత్ర వాని భార్యలు. అతఁడొకనాఁడు వేఁటకేఁగి ప్రమాదవశమునఁ దమసానది యొద్దున శ్రమణుఁడను మునికుమారుని జంతువను బుద్ధితో వధించెను. శ్రమణుని తల్లిదండ్రులు దశరథుని సుతవియోగశోకముతో మరణించునట్లు శపించిరి. దశరథుఁడు భార్యలతోఁ గలిసి పుత్త్రప్రాప్తికై దేవతల నారాధించెను. దేవతానుగ్రహమున రామ –లక్ష్మణ–భరత–శత్రుఘ్నులను నలుగురు కొడుకులు కలిగిరి. వారు పెద్దవారై శస్త్రాస్త్ర విద్యల నభ్యసించుచుండిరి. ఆ సమయములో విశ్వామిత్రుఁ డయోధ్యకు వచ్చి తాటకావధకై రామ–లక్ష్మణులఁ బంపుమని దశరథునిఁ గోరెను. రామలక్ష్మణులు విశ్వామిత్రుని వెంటనేఁగి తాటకను సుబాహుని వధించిరి.

(భార) పాండు మహారాజు హస్తినాపురములో సుఖముగా నివసించుచుండెను. కుంతి, మాద్రి యతని భార్యలు. ఒకనాఁడతఁడు వేఁటకేఁగి మృగరూపములో రమించుచున్న మునినిఁ దెలియక వధించి భార్యతో సంగమించినచో మరణించునట్లు శపింపఁబడెను. పాండుఁడు భార్యలతో సంతతికై దేవతల నారాధించెను. దేవతానుగ్రహమున వారికి యుధిష్ఠిర – భీమ – అర్జున – నకుల – సహదేవులను పుత్త్రులుదయించిరి. పాండురాజు శాపము మఱచి మాద్రితో సంగమించి మరణించెను. మాద్రి భర్తతో సహగమించెను. పాండవులు పెద్దవారై ద్రోణ కృపాచార్యుల దగ్గఱ శస్త్రాస్త్రవిద్యల నభ్యసించుచుండిరి. దుర్యోధనుని దురాలోచనతో ధృతరాష్ట్రుఁడు పాండవులను వారణావతమునకుఁ బంపెను. పాండవులు కుంతితోఁ గలిసి లక్కయింట నివసించిరి. లాక్షాగృహదహనమును దెలిసికొని భీముఁడు తల్లిని సోదరులను దీసికొని లక్కయింటినుండి బయటకు వెడలి వనమార్గములోఁ బయనించుచుండెను. హిడింబ యను రాక్షసి భీముని గాంచి ప్రేమించెను. భీముఁడు హిడింబను వివాహమాడి యొక పుత్త్రుని గాంచెను. భీముఁడు బకాసురుని వధించెను.

**2. ద్వితీయసర్గము :** (రామా) : శ్రీరాముఁడు సీతా స్వయంవరములోఁ బాల్గొనుటకై జనకపురమున కేఁగెను. త్రోవలో నహల్యాశాపవిమోచనము గావించెను. శ్రీరాముఁడు హరధనుర్భంగము గావించెను. శ్రీరామునకు, సోదరులకు – సీతతో నామె చెల్లెండ్రతో వివాహమైనది. దశరథుఁడు కొడుకులతోఁ గోడండ్రతో నయోధ్యకు బయలుదేరుచుండఁగాఁ బరశురాముఁడడ్డగించెను. రాముని చేతిలోఁబరశురాముఁడోడెను. దశరథాదు లయోధ్య చేరిరి. భరతుఁడు మేనమామ యింటికేఁగెను.

(భార) : ద్రౌపదీ స్వయంవరమునకై పాండవులు పాంచాల పురము చేరిరి. దృష్టద్యుమ్నుఁడు

మత్స్యయంత్రమును ఛేదించిన వానికే ద్రౌపది భార్య యగునని ప్రకటించెను. రాజపుత్రులెవ్వరు మత్స్య యంత్రమును భేదింపలేకపోయిరి. అర్జునుఁడు భేదించెను. నారద మహర్షి యనుజ్ఞతోఁ బంచపాండవులు ద్రౌపదిని వివాహమాడిరి. పాండవులు హస్తినాపురమునకేఁగుచుండఁగా దుర్యోధనుఁడడ్డగించెను. అర్జునుఁడు దుర్యోధను నోడించెను. పాండవులు కొంతకాలము హస్తినలో నివసించిరి. అర్జునుఁడు తీర్థయాత్రకు వెడలి యులూచిని, చిత్రాంగదను, సుభద్రను వివాహమాడి సంతానమును గాంచెను.

**3. తృతీయసర్గము :** (రామా) : ఇంద్రునకు యుద్ధములోఁ దోడ్పడుటకై దశరథుఁడు స్వర్గమునకేఁగెను. శత్రువులను జయించెను. ఇంద్రునిచే గౌరవింపఁబడి యయోధ్య చేరెను. కైకకు రెండు వరములిచ్చుటకుఁ బ్రతిజ్ఞ చేసెను. దశరథుఁడొక యజ్ఞము చేసెను. శ్రీరామునకుఁ బట్టము కట్టుటకై నిర్ణయించుకొనెను.

(భార) : అగ్ని బ్రాహ్మణవేషములో వచ్చి యర్జునునకు ఖాండవదహనమును గూర్చి చెప్పి గాండీవము నిచ్చెను. శ్రీకృష్ణార్జునులింద్రునెదిర్చి మేఘవర్షములను నిలువరించిరి. అర్జునుఁడు ఖాండవవనములో మయుని రక్షించెను. మయుఁడు ధర్మరాజునకు మయసభను నిర్మించెను. ధర్మజుఁడు రాజసూయయాగము గావించెను. దుర్భాషలాడిన శిశుపాలుని శ్రీకృష్ణుఁడు సంహరించెను. ధర్మరాజు జూదములో నోడి యరణ్యాజ్ఞాతవాసములు చేయవలసివచ్చెను. పాండవులు మునులతో నరణ్యవాసము గావించిరి. విదురుడు పాండవులను గలిసెను. భీముఁడు కిర్మీరుని వధించెను.

**4. చతుర్థసర్గము :** (రామా) : శ్రీరాముఁడగస్త్యాశ్రమమున కేఁగెను. అనేక దివ్యాస్త్రములు పొందెను. అక్కడనుండి పంచవటి చేరెను. శూర్పణఖ సుందరస్త్రీవేషముతో వచ్చి రాముని వివాహమాడఁ గోరెను. లక్ష్మణుఁడామె చెవులను ముక్కును గోసెను. ఖరదూషణాదులు సైన్యముతో రాఁగా శ్రీరాముఁడు వారిని వధించెను.

(భార) : అర్జునుఁడు తపస్సుచేసి శివుని మెప్పించి ధనుర్వేదమును బొందెను. అర్జునుఁడు స్వర్గలోకమున కేఁగి నివాతకవచులను గెలిచెను. ఊర్వశి యర్జునునిఁ గామించెను. నిరాకరించిన యర్జునుని శపించెను. అర్జునుఁడింద్రునిచే సత్కరింపఁబడి మరల నరణ్యమునకు వచ్చి ద్రౌపదితో సోదరులతోఁ గలిసి వారికి హర్షమును గూర్చెను.

**5. పంచమసర్గము :** (రామా) : రాముని ప్రభావముతో మహర్షులు హర్షించిరి. రామాదులు సత్యకాంతిలక్ష్ములను బొందిరి. రాముఁడు మాయామృగమైన మారీచుని వెంటాడెను. రావణుఁడు పంచవటి చేరి సీత నపహరించెను. జటాయువు రావణు నడ్డగించెను. రాముఁడు కబంధుని సంహరించెను, రాముఁడు పంపాసరోవరము చేరి ఋశ్యమూకముపై నున్న సుగ్రీవునితో స్నేహము చేసి వాలిని వధించెను. రాముఁడు మాల్యవంతము చేరెను. వర్షాకాలము, శరత్కాలము వచ్చినవి.

(భార) : ధర్మరాజు భీము నజగరమునుండి విడిపించెను ద్రౌపది సత్యభామను గలిసెను.

దుర్యోధనుఁడు ఘోషయాత్రకు వచ్చెను. పాండవులు వనములో విహరించుచుండఁగా జయద్రథుఁడు ద్రౌపది నపహరించుటకుఁ బూనుకొనెను. సైంధవుని భీముఁ డడ్డగించెను. యక్షుఁడు పాండవులను బరీక్షించెను. పాండవులు విరాటనగరమును చేరిరి. భీముఁడు కీచకుని వధించెను. వర్షాశరత్కాల వర్ణనము.

**6. షష్ఠసర్గము :** (రామా) : శరత్కాలములో రాముఁడు సీతకై దుఃఖించెను. సుగ్రీవుఁడు వానరసేనను సమీకరించెను. హనుమంతుఁడు సీతాన్వేషణమునకై బయలుదేరి సముద్రతీరము చేరి సంపాతి మాట విని సముద్రమును లంఘించి యశోకవనములో సీతను దర్శించెను. సీత కంగుళీయము నిచ్చి తాను రామదూత నని చెప్పెను. అశోకవనమును భంజించి రాక్షసులతో యుద్ధము చేసి మేఘనాదునిచే బంధింపఁబడి రావణుని సమ్ముఖము చేరి 'రామునకు సీతనిచ్చి శరణు పొందు'మని యుపదేశించెను. లంకాదహనము గావించెను. చూడామణిని బొంది సముద్రమును దాఁటి యంగదాదులను గలసికొనెను. శ్రీరామునకు **సీతావిషయము** చెప్పి యనుగ్రహింపఁబడెను. రాముఁడు సీతదేవి చూడామణిని జూచి యానందించెను.

(భార) : సుశర్మతో దుర్యోధనాదులు గోగ్రహణమునకై విరాటపట్టణము నాక్రమించిరి. విరాటుఁడు గోరక్షణమునకై సైన్యమును సమీకరించెను. బృహన్నలతో నుత్తరుఁడు యుద్ధయాత్ర గావించెను. జయద్రథుఁ డవమానింపఁబడెను. అర్జునుఁడు గోవులను సందర్శించి కౌరవసేనను వధించెను. అర్జునుఁడు దుర్యోధను నవరోధించెను. విరాటుఁడు యుధిష్ఠిరుని బాచికతోఁ గొట్టి తన యపరాధమును క్షమింపఁగోరెను. అభిమన్యునకుఁ దన కూఁతురగు నుత్తర నిచ్చి వివాహము చేయఁ దలపెట్టెను.

**7. సప్తమసర్గము :** (రామా) : శ్రీరాముని సేనాసమారోహము. విభీషణుఁడు శ్రీరాముని శరణువేఁడుట. రాముఁడు సముద్రమును దర్శించుట. రామునకు సముద్రదేవత ప్రత్యక్ష మగుట. సేతునిర్మాణము. వానరసైన్యము సువేలాద్రిపై విడియుట, రావణుఁడు పంపఁగా శుకుఁడు దూతగా వచ్చి రావణునితో యుద్ధము వలదని రామునకుఁ జెప్పుట. సుగ్రీవుని సమాధానము. అంగద రాయబారము. శ్రీరాముని యుద్ధసన్నాహము చెప్పఁబడినది.

(భార) : యుధిష్ఠిరుని సేనాసన్నాహము, ఘటోత్కచుఁడు ధర్మరాజును గలియుట, కృష్ణసాహాయ్యమును గోరుటకు వచ్చిన దుర్యోధనుఁడు సముద్రమును దర్శించుట. యర్జునుఁడు ద్వారకకు వచ్చి సముద్రమును దర్శించుట. శ్రీకృష్ణుఁడు దుర్యోధనునకు సైన్యసాహాయ్యము కూర్చుట, ధృతరాష్ట్రుని దూత పాండవుల యొద్దకు వచ్చుట, సేనాసన్నాహము; శ్రీకృష్ణ రాయబారము చెప్పఁబడినవి.

**8. అష్టమసర్గము :** (రామా) : రామ – రావణులు సేనాసన్నాహము, నీలుని సేనాధిపత్యము, రామునిసైన్యములో హనుమంతుఁడు, అంగదుఁడు, నీలుఁడు, గజుఁడు, కుముదుఁడు, తారుఁడు, మొదలగు వారు వీరులుగా నిల్చుట. రావణుని సైన్యములో మేఘనాదుఁడు, ప్రహస్తుఁడు,

చిత్రకాయుఁడు, నరాంతకుఁడు, లోహితాక్షుఁడు వీరులుగా నిలుచుట. ఉభయసేనలు తలపడుట, రక్తప్రవాహము, అశ్వినీదేవతల కుమారులైన మైంద – ద్వివిదులు శత్రువులతోఁ బోరుట, నీలుని యుద్ధము, విభీషణుఁడు రాక్షసులను బాఱఁద్రోలుట, ఇంద్రజిత్తు రామలక్ష్మణులను నాగపాశములతో బంధించుట, గరుత్మంతుఁడు వచ్చి రామలక్ష్మణులను విడిపించుట, నీలుఁడు ప్రహస్తుని జంపుట, రావణుఁడు యుద్ధమునకు వచ్చుట వర్ణింపఁబడినవి.

(భార) : యుధిష్ఠిర – దుర్యోధనుల సేనాసన్నాహము, హనుమంతుఁడర్జునుని జెండాపై నిలుచుట, ఉభయసేనల యుద్ధము, అశ్వినీకుమారులగు నకుల సహదేవులు విజృంభించుట, ధృష్టద్యుమ్నుని సైన్యాధిపత్యము, ఘటోత్కచుఁడు యుధిష్ఠిరుని గౌరవించి కౌరవసైన్యముపై విజృంభించుట, భీష్మాభిమన్యుల యుద్ధము, భీష్ముఁడు శ్రీకృష్ణార్జునులను బాణములతో ముంచుట, శ్రీకృష్ణుఁడు రథము దిగి భీష్మునిపైఁ గవియుట, యర్జునుఁడు శ్రీకృష్ణుని వెనుకకు మరల్చుట, భీష్ముఁడు పాండవసైన్యమును వధించుట, యర్జునుఁడు శిఖండితో భీష్ముని గూల్చుట, కర్ణుఁడు యుద్ధమునకు వచ్చుట వర్ణింపఁబడినవి.

**9. నవమసర్గము :** (రామా) : రామ–రావణ సైన్యములు పోరుట, సుగ్రీవునిచే మానభంగము నొందిన రావణుఁడు లంకాపురికేఁగుట, కుంభకర్ణుని భయంకరయుద్ధము, శ్రీరాముఁడు కుంభకర్ణుని సంహరించుట చెప్పఁబడినవి.

(భార) : పాండవ–కౌరవ సేనలు పోరుట, అర్జునునిచే మానభంగము నొందిన కర్ణుఁడు శిబిరము చొచ్చుట. భగదత్తుని భయంకరయుద్ధము, అర్జునుఁడు భగదత్తుని సంహరించుట చెప్పఁబడినవి.

**10. దశమసర్గము :** (రామా) : స్వజనవధకుఁ గోపించిన రావణుఁడు పెద్దసైన్యమును సన్నాహము చేయుట, దేవాంతక – అంగదుల యుద్ధము, అంగదుని భయంకరయుద్ధములో రాక్షససేనలో రక్తనదులు ప్రవహించుట, అంగదుఁడు దేవాంతకుని సంహరించి స్వస్థచిత్తుఁ డగుట, రావణుఁడు కోపించి భయంకరయుద్ధమున కుద్యమించుట, హనుమంతుఁడు త్రిశిరుని వధించుట, లక్ష్మణుఁ డతికాయుని సంహరించుట చెప్పఁబడినవి.

(భార) : స్వజనవధకు దుర్యోధనుఁడు కోపించి సైన్యమును సంఘటించుట, ద్రోణాచార్యుఁడు పద్మవ్యూహము పన్నుట, సుశర్మ – అర్జునుల యుద్ధము, పద్మవ్యూహమును భేదించుటకు యుధిష్ఠిరుఁడభిమన్యు నాదేశించుట, అభిమన్యుని భయంకరయుద్ధము, కౌరవసైన్యములో రక్తనదులు ప్రవహించుట, అభిమన్యునకు – దుశ్శాసనపుత్త్రుఁడగు దోషణునకు యుద్ధము. అభిమన్యుని మరణము, ద్రోణుఁడు స్వస్థచిత్తుఁడగుట, అర్జునుఁడశాంతితో యుద్ధమునకుద్య–మించుట, సాత్యకి భూరిశ్రవుని వధించుట, అర్జునుఁడు సైంధవుని సంహరించుట చెప్పఁబడినవి.

**11. ఏకాదశసర్గము :** (రామా) : మేఘనాదుని భయంకరయుద్ధము, సూర్యపుత్త్రుఁడు (సుగ్రీవుఁడు) రాక్షసులతోఁ బోరుట, రాత్రి యుద్ధములో సుగ్రీవుఁడు కుంభుని వధించుట, నికుంభుని యుద్ధము,

హనుమంతుఁడు నికుంభుని చంపుట, ఖరుని పుత్త్రుఁడగు మకరాక్షుని యుద్ధము, రాముఁడు మకరాక్షుని వధించుట వర్ణింపబడినవి.

(భార) : ద్రోణాచార్యుని భయంకరయుద్ధము, రాత్రి యుద్ధములో సూర్యపుత్త్రుఁడు (కర్ణుఁడు) ఘటోత్కచునితోఁ బోరి వధించుట, ధృష్టద్యుమ్నుఁడు ద్రోణాచార్యుని వధించుట. అశ్వత్థామ విజృంభణము. అశ్వత్థామ ప్రయోగించిన నారాయణాస్త్రము శ్రీకృష్ణుని ప్రభావముచే నష్టమగుట చెప్పఁబడినవి.

**12. ద్వాదశసర్గము :** (రామా) : రావణుఁడింద్రజిత్తును యుద్ధమునకుఁ బంపుట, శ్రీరామసైన్యమునకు నీలుఁడు సేనాపతి యగుట, శ్రీరామ – మేఘనాదుల యుద్ధము, మేఘనాదుఁడు మాయాసీతను సృష్టించి వధించుట, శ్రీరాముఁడు శిబిరమునకు వచ్చి లక్ష్మణునకీ వార్త చెప్పుట, లక్ష్మణుఁడు శోకించుట, ఇది యంతయు రాక్షసమాయ యని విభీషణుఁడు చెప్పుట, రాముఁడు లక్ష్మణుని యుద్ధమునకుఁ బంపుట, విభీషణుఁడు రాక్షససైనికులను వధించుట, మేఘనాద – లక్ష్మణుల యుద్ధము, లక్ష్మణుఁడు మేఘనాదుని సంహరించుట, రావణుఁడు సేనాధ్యక్షుఁడై యుద్ధమునకు వచ్చుట, రాముఁడు రాక్షససేనపై విజృంభించుట, విరూపాక్షవధ, తన సేన నశించుటచే రావణుఁడు శోకాకులుఁడై సాయంకాలము లంకాపురము చొచ్చుట వర్ణింపఁబడినవి.

(భార) : దుర్యోధనుఁడు కర్ణుని యుద్ధమునకుఁ బంపుట, పాండవసేనకు ధృష్టద్యుమ్నుఁ డధ్యక్షుఁడగుట, యుధిష్ఠిర – కర్ణుల యుద్ధము, కర్ణుఁడు ధర్మరాజు నవమానించుట, యుధిష్ఠిరుఁడు శిబిరమునకు వచ్చి యర్జునునకీ విషయము చెప్పుట, అర్జునుఁడు యుధిష్ఠిరునిపైఁ గోపించుట, శ్రీకృష్ణుఁ డుభయులను శాంతింపఁజేయుట, యుధిష్ఠిరుఁ డర్జునుని శత్రువధకై పంపుట, భీముఁడు దుశ్శాసనుని సంహరించుట, యర్జునుఁడు కర్ణుని వధించుట, కౌరవసేనకు శల్యుఁ డధ్యక్షుఁడగుట, యుధిష్ఠిరుఁడు శల్యుని వధించుట, సహదేవుఁడు శకునినిఁ జంపుట, తన సేన యెక్కువగా నశించుటచే సాయంకాలము దుర్యోధనుఁడు వ్యాసహ్రదములోఁ బ్రవేశించుట వర్ణింపఁబడినవి.

13. త్రయోదశసర్గము : (రామా) : శ్రీరాముఁడు లంకాదుర్గమును ముట్టడించుట, రావణుఁడు బైఁటకు వచ్చుట; శ్రీరాముఁడు రావణుని యుద్ధమున కాహ్వానించుట, రామరావణయుద్ధమును గంధర్వాది దేవతలాకాశముపై నుండి తిలకించుట, యుద్ధములో విజయమునకై సందేహించుచున్న శ్రీరామునకుఁ బురాతనముని యగస్త్యుఁడు వచ్చి యుపాయము (ఆదిత్యహృదయము) నుపదేశించుట, పదితలలు గోల్పోయిన రావణుఁడు భూమిపై కొరుగుట, దేవాంగనలు నృత్యము చేయుచుఁ బుష్పవృష్టి కురిపించుట, అగ్నిప్రవేశము చేసిన సీత నగ్నిదేవత బైఁటకుఁ దెచ్చుట, శ్రీరాముఁడు విమానముపై నయోధ్యకుఁ బ్రయాణమగుట, భరతునితోఁ గలియుట, యయోధ్యలో మహోత్సవము, శ్రీరాముఁడానందబాష్పములతో సీతను జూచుచున్న కౌసల్యకు నమస్కరించుట, రామలక్ష్మణాదుల జటామోక్షము, శ్రీరామరాజ్యాభిషేకము, రాజ్యములో సుఖసమృద్ధి, శ్రీరాముఁడు వానరులను వారి నివాసములకుఁ బంపుట, శ్రీరాముఁడగస్త్యుని వలన ననేకప్రాచీనకథలు వినుట చెప్పఁబడినవి.

(భార) : దుర్యోధనుని వ్యాసహ్రదమునుండి బైటకు రప్పించుటకై యుధిష్ఠిరుఁడు సేనతో వెళ్ళుట, భీముఁడు దుర్యోధనుని యుద్ధమున కాహ్వానించుట, బలరాముని యాగమనము, భీమ – దుర్యోధనుల గదాయుద్ధమును దేవగంధర్వులు దర్శించుట. పురాతనముని యగు శ్రీకృష్ణుఁడు (దుర్యోధనునిఁ దొడలపైఁగొట్టుమని) భీమునకుపాయముచెప్పుట, దుర్యోధనుఁడు తొడలు విరిగి భూమిపై వ్రాలుట, దేవతాస్త్రీలు పుష్పవృష్టి కురియించుట, ద్రౌపది సంతాపముతీరుట, యుధిష్ఠిరుఁడు రాజధానికిఁ బయనమై ధృతరాష్ట్రునిఁ గలియుట, హస్తినాపురములో మహోత్సవము, యుధిష్ఠిరాదుల జటామోక్షము, ధర్మరాజానందముతో ద్రౌపదిని జూచుచున్న కుంతీదేవికి నమస్కరించుట, ధర్మజుని పట్టాభిషేకము, ధర్మరాజు భీష్మునొద్దననేక పురాణకథలు వినుట, ధర్మరాజు శ్రీకృష్ణుని ద్వారకానగరికిఁ బంపుట వర్ణింపఁబడినవి.

శ్లో॥ శ్రియా జుష్టః స భారత్యా, సానుజః సాధువత్సలః ।
పృథివీమ్ పాలయామాస, కామదేవ ఇవాపరః ॥ (13–64)

శ్రీయుక్తుఁడైన శ్రీరాముఁడు (ధర్మరాజు) భారతితో (రామా : భరతునికి సంబంధించిన దానితో; భార : భరతవర్షమునకు సంబంధించిన దానితో) కామదేవ – సభయందు రతితోఁ లేక కాంతితోఁగూడిన **రతిదేవితో**) సోదరులతో సాధువత్సలుఁడై రెండవ కామదేవునివలె భూమినిఁ బాలించె నను శ్లోకముతోఁ గావ్యము ముగింపఁబడినది.

### ప్రక్షిప్తములు – నిక్షిప్తములు

తెలుఁగు లిపి (1892) లో నున్న ప్రేమచంద్ర వ్యాఖ్యానప్రతిలో 673 శ్లోకములు గలవు. నాగరలిపి (2014)లో నున్న దామోదరప్రతిలో 668 శ్లోకము లున్నవి. ఈ వ్యత్యాసము 8–9 సర్గములందే గలదు.

శ్లో॥ వ్యూహద్వయే వాసరరాత్రికల్పే (8–16)
శ్లో॥ మేదోవసాపిచ్ఛిలకచ్ఛలగ్నౌ (8–17)
శ్లో॥ ఆపీయ పూరం రుధిరాపగానామ్ (8–18)
శ్లో॥ చరణఖనితపృథ్వీమండలోద్ధూతధూళీ (8–19)
శ్లో॥ రక్తాసవానందితడాకినీకః (8–20)
శ్లో॥ ప్రసర్పిరక్షో బలనాయకాముహుః (8–21)

ఈ యాఱు శ్లోకములు ప్రేమచంద్రవ్యాఖ్యాన పుస్తకములోఁ గలవు. దామోదరవ్యాఖ్యాన పుస్తకములో లేవు.

"ఏతదాది శ్లోక షట్కమ్ పాశ్చాత్య పుస్తకేషు న దృశ్యతే; కింతు సంగతార్థమితి వ్యాఖ్యాతమ్" అని ప్రేమచంద్రుఁడు చెప్పినాఁడు.

**శ్లో॥ విహాయ పూర్వం చతురంగభంగం – నరప్రవీరేణ విరోధివర్యః ।**
**మత్తః కరీ కేసరిణేవ మౌళా – జఘ్నే నఖేనేవ శిలీముఖేన ॥** (9–27)

**సుబోధినీవ్యాఖ్యా** : నరప్రవీరేణ మనుష్యేషు శ్రేష్ఠయోధేన రామేణ । పక్షే – నరావతారత్వాత్ శ్రేష్ఠయోధేనార్జునేన । పూర్వమ్ ప్రథమం చతురంగభంగం హస్త్యశ్వరథపాదాతస్వరూపచతురంగిణీ సేనావినాశమ్ । విహాయ త్యక్త్వా । కేసరిణా సింహేన । నఖేన నఖరేణ । మౌలౌ మస్తకే విరోధివర్యః శత్రుశ్రేష్ఠః కుంభకర్ణః । పక్షే – భగదత్తః । జఘ్నే ప్రహృతః । అత్రేంద్రవజ్రోపేంద్రవజ్రయోరుపజాతి–వృత్తమ్ । **ఉపమాలంకారః** ॥

ఈ శ్లోకము దామోదర ప్రతిలోఁగలదు. ప్రేమచంద్రప్రతిలో లేదు. పాఠకుల సౌకర్యమునకై దామోదర ఝా – సుబోధినీ వ్యాఖ్యతో నిచ్చితిని.

శ్లో॥ తస్య వానరసింహస్య (9–24) అథాయం కామరూపేశః (9–25)

ఈ రెండు శ్లోకములు దామోదరవ్యాఖ్యలో ముందు వెనుకల నున్నవి. అనఁగా 24వ శ్లోకము 25వ శ్లోకముగా, 25వ శ్లోకము 24వ శ్లోకముగా నున్నవి.

శ్లో॥ విపక్షవీరో రణపండితేన – సజిష్ణునా సంగరరంగమధ్యే ।
రామేణ జఘ్నే క్షిపతా మహాస్త్రం – ఖరః పురస్తాదివ కుంభకర్ణః ॥ (9–27)

అను ప్రేమచంద్రప్రతిలోని శ్లోకము.

శ్లో॥ సజిష్ణునా సంగరరంగమధ్యే – విపక్షవీరః క్షిపతా మహాస్త్రమ్ ।
ఖరః పురస్తాదివ కుంభకర్ణో – రామేణ జఘ్నే రణపండితేన ॥ (9–28)

అని దామోదరప్రతిలోఁ గొంచెము వ్యత్యాసముగా నున్నది. ప్రేమచంద్ర పుస్తకములో ముందు 1. సర్వతోభద్రబంధము (13–60) తరువాత 2. చక్రబంధము (13–61) ఉన్నవి. ఇవి రెండు దామోదరప్రతిలో ముందు వెనుకలుగా నున్నవి. సపూజ్యానభిషేకాంతే (13–63) ఈ శ్లోకము దామోదరప్రతిలో లేదు. తక్కిన గ్రంథమంతయు రెండు వ్యాఖ్యలలోను సమానముగానే యున్నది. కొన్ని శ్లోకములలోఁ జిన్న చిన్న పాఠభేదములున్నను నవి యంత పట్టించుకొనఁ దగినవి కావు.

## వర్ణనానైపుణ్యము

'కవృ – వర్ణనే' యను ధాతు పాఠము ననుసరించి వర్ణించు వాఁడు కవి. వర్ణన ప్రధానమైనది కావ్యము. కవిరాజు రెం డితిహాసకథలను జక్కగా జోడించుటయే కాక చక్కని వర్ణనలను గూడఁ గూర్చినాఁడు.

ప్రథమసర్గములో దశరథ – పాండురాజుల వేఁట; ద్వితీయసర్గములో సీతా – ద్రౌపదుల సౌందర్యము; పంచమసర్గములో వర్షా – శరదృతువులు, సప్తమసర్గములో సముద్రము; అష్టమసర్గమునుండి చివరి దాఁక యుద్ధము వర్ణింపఁబడివి.

శ్లో॥ సా దుగ్ధసింధో రుదితైవ లక్ష్మీ – ర్లావణ్యమస్యా నియతం సుధైవ ।
యదేతదాపీయ దృశా ప్రపేదే – మనుష్యలోకోఽ ప్యనిమేషభావమ్ (2–10)

క్షీరసముద్రమునుండి పుట్టిన లక్ష్మియే సీత (ద్రౌపది). ఆమె సౌందర్యమమృతమే. ఆ యమృతమును గన్నులతోఁ ద్రావి మనుష్యులుకూడ తెప్పపాటు లేకుండ దేవతాభావము నొందిరి.

సముద్రవర్ణనము :

శ్లో॥ దుర్గం తుంగోత్తరంగావలిమిలితమహానక్రమావర్తచక్ర-
భ్రామ్యద్ డిండీరపిండప్రతిగలితసితచ్ఛత్రవిస్తారశోభమ్ ।
అంభస్సంభారభారాలసజలదఘటాదుర్దినీభూతదిక్కం
దిక్కుంభిప్రౌఢశుండాశకలితసలిలం సాగరం సోఽభ్యపశ్యత్ ॥ (7-9)

ప్రవేశించుటకు శక్యము కానిది, యెత్తైన కెరటముల పంక్తితోఁ గూడిన మొసళ్ళు గలది. గుండ్రని సుళ్ళయందుఁ దిరుగు నురుగు ముద్దల వెల్లగొడుగుల గొప్ప శోభ గలది, నీళ్ళ సమూహము యొక్క బరువుచే మెల్లగా వచ్చు నల్లనిమేఘముల గుంపులచే దుర్దినములు (మేఘచ్ఛన్నం తు దుర్దినమ్) గాఁ జేయఁబడిన దిక్కులు గలది; దిగ్గజముల గట్టి తొండములచేఁజెల్లాచెదరు చేయఁబడిన జలము గలది యగు సముద్రమును శ్రీరాముఁడు (అర్జునుఁడు) గాంచెను.

ఆకాశవర్ణనము :

శ్లో॥ ముఖారవిందైః సురసుందరీణాం - నభో బభూవేహ సహస్రచంద్రమ్ ।
సహస్రగంగం చ తదోత్సుకానాం - విమానహంసావలిభిః సురాణామ్ ॥ 13-6

శ్రీరామ - రావణుల (భీమ - దుర్యోధనుల) యుద్ధమును జూచుటకు దేవత లాకాశము నలంకరించిరి. అప్సరః స్త్రీల ముఖపద్మములతో నాకాశము వేయి చంద్రులతో నొప్పినది. దేవతల విమానహంసల సమూహముతో నాకాశము వేయి గంగా ప్రవాహములతో శోభిల్లినది. ఇక్కడ సహస్రశబ్ద మనంత వాచకము. ఆకాశమనేకచంద్రబింబములతో, ననేకగంగానదులతో విరాజిల్లిన దని భావము.

ఈ విధముగా 13 సర్గముల బంధము గలది, రామ - ధర్మరాజులతో నేకనాయకాశ్రయ మైనది, సుందరమైన వర్ణనలు గలది, వివిధ వృత్తములతోఁ గూడినది, వీరరస ప్రధానమైనది. యితిహాసోద్భవమైన కథావస్తువు గలది యగు నీ రాఘవపాండవీయము మహాప్రబంధమే.

మహాప్రబంధలక్షణమును గవిరాజే యిట్లు వివరించినాఁడు -

శ్లో॥ సరసమ్ బహుయోజనాధివాసమ్ - భృతగాంభీర్యమనుజ్ఝితప్రసాదమ్ ।
స మహార్థముపాసదత్సముద్రం - ధ్వనిభాజం సుకవేరివ ప్రబంధమ్ ॥ (7-10)

రసము (జలము)తోఁ గూడినది, యనేక సంఘటనముల (యోజనముల)తో వ్యాపించినది, గంభీర(లోఁతు) మైనది, ప్రసాదగుణమును (స్వచ్ఛతను) విడిచి పెట్టనిది, గొప్ప యర్థములు (రత్నాదులు) గలది, ధ్వని (తరంగఘోష) కలది, యగు సత్కవి ప్రబంధమువలె నున్న సముద్రమును (ముద్రాలంకారముతోఁ గూడినదానిని) శ్రీరాముఁడు (అర్జునుడు) చూచెనని భావము.

ఈ లక్షణము లన్నియు రాఘవపాండవీయములోఁ బుష్కలముగాఁ గలవు.

## సుభాషితములు

ఈ కావ్యములో నందమైన వర్ణనలవలెనే గొప్పసుభాషితములు గలవు.

1. **నాస్త్యలభ్యం తపోభిః** (2-14) : తపస్సులకు లభ్యము కానిది లేదు.

2. **సతాం హి సంగో వ్యసనార్ణవే నౌః** (3-37) : సజ్జనసాంగత్యము వ్యసనసముద్రము దాఁటుటకు నావ.

3. **వైషమ్యో హి పుంనార్యో ఘటనా మృతజీవికా** (4-8) : స్త్రీపురుషుల వైషమ్యసంఘటనము జీవన్మరణము.

4. **నహి జగతి నిధానం సర్వలోకప్రకాశే** (5-21) : బంగారము, ధనము మొదలగు నిధిని సకలజనగోచరముగా నుంచఁగూడదు. (నిధిని గుప్తముగా నుంచ వలెనని భావము).

5. **సుఖేషు దుఃఖేష్వథవా స్థితోఽయం - యదేక భావేన పతిర్నిషేవ్యః ॥** (5-28)

స్త్రీ భర్తను సుఖదుఃఖములలో సమానముగా సేవింపవలెను.

6. **తృణే మహానీలశిలేవ సక్తిం - కరోత్యపాత్రే ఖలు కామినీతి ॥** (5-30)

అపాత్రుఁడైన పురుషునితోఁ గామిని జీవించుట పచ్చగడ్డిలో నింద్రనీలమణి నుంచుట వంటిది.

7. శ్లో॥ **భిక్షావృత్తిం హరమపి జహౌ జాహ్నవీ సిన్ధునమ్రా**
**హిత్వా నాగానుపరతమదాన్ పంకజం యాతి భృంగీ ।**
**వీర్యోదగ్రమ్ భజతి నృపతిమ్ ప్రాక్తనమ్ ప్రోహ్య పృథ్వీ**
**సారాపేతాః సరసిజదృశస్తూలతుల్యా భవంతి ॥** (5-33)

బిచ్చమెత్తు శివుని విడిచిపెట్టి గంగ సముద్రుని జేరినది. మదజలము లేక చిక్కిన యేనుఁగులను విడిచిపెట్టి యాఁడు తుమ్మెద పద్మము నాశ్రయించినది. నిర్వీర్యుఁడైన ప్రాఁతమగని విడిచిపెట్టి భూమి క్రొత్త రాజును సేవించుచున్నది. ధనహీనులైన పురుషులు స్త్రీకి దూదితో సమానులు.

8. **న యాతి కో నామ వశం గుణానామ్** (5-47) : మంచి గుణములకెవఁడు వశము గాఁడు?

9. **అనాత్మనీనే పథి వర్తమానాత్ - పుంసో హి లోకా భృశముద్విజంతే ॥** (7-26) - ఇష్టము (మంచి) కాని మార్గములో సంచరించు పురుషుని జూచి లోకు లెక్కువ యుద్వేగము చెందుదురు.

10. **హితోపదేశేషు పరాఙ్ముఖానా - మదూరసంస్థా విపదో హి పుంసామ్ ।** (7-27) - హితోపదేశములు వినని వారికి విపత్తులు దగ్గఱలోనే యుండును.

11. **భవంతి సువ్యక్తమనాత్మవేదినః - పరోపదేశేషు విశేషపండితాః ॥** (7-29) - ఆత్మకేది హితమో యేది హితముకాదో తెలియని మూర్ఖులు పరుల కుపదేశములు చేయుటలో మాత్రము గొప్ప పండితులు.

12. **తథా జనశ్చేదఖిలోఽపి ధర్మం - జగత్యధర్మస్య కుతోఽవకాశః ॥** (7-31) - జనులందఱు ధర్మాత్ములైనచో లోకములో నధర్మమున కవకాశమెక్కడ?

13. **ఆపత్సు ముహ్యంతి న మానభాజః** (10-1) – మానవంతు లాపదలు వచ్చినప్పుడు మోహము చెందరు.

14. న కోఽపి సర్వప్రియతాముపైతి (11-15) – లోకములో నెవ్వఁడు నందఱికి హితుఁడు గాఁడు.

**సామాజిక దృష్టి**

ప్రాచీనులు మహాకవులై రాజాస్థానముల నలంకరించినను సేద్యముచేసి కర్షకుల కష్టసుఖము లను దెలిసికొన్నవారు.

శ్లో॥ స వాక్ఛరైరాహితమర్మఘట్టన – శ్చకార పీడామ్ మహతీమ్ మహీపతేః ।
క్షణేన సీతాక్షపణవ్యళీకతః – కృషీవలస్యేవ మహానవగ్రహః ॥ (12-13)

ఇంద్రజిత్తు మాయాసీతను వధించి వాగ్బాణములతో శ్రీరామునకుఁ బీడ కలుగఁజేసెను. కర్ణుఁడు దుర్భాషలాడి ధర్మరాజునకుఁ బీడ కల్గించెను. ఇది గొప్ప యవగ్రహము. అనావృష్టి – (వానలు లేకపోవుట) నాఁగలితో భూమిని దున్నుటకులేక కృషీవలునకుఁ బీడ కల్గించి నట్లున్నది.

**పూర్వకవుల ప్రభావము**

**వాల్మీకి – వ్యాసుఁడు :** ఇది రాఘవపాండవీయ మగుటచే వాల్మీకి వ్యాసుల ప్రభావము కావ్య మందంతట కలదు. అందువల్లనే ప్రథమసర్గములో 7వ శ్లోకము మొదలుకొని 6 శ్లోకములలో రామాయణ – భారత కర్తలను భక్తితో స్తుతించినాఁడు.

శ్లో॥ శ్రీరామాయణమాణిక్యమ్, భారతస్వర్ణముద్రితమ్ ।
న కస్య కురుతే లోకే విస్మయోల్లాసిమానసమ్ ॥ (1-36)

శ్రీమద్రామాయణము జాతికెంపు వంటిది. అది భారతమను బంగారు వస్తువులోఁ బొదగఁబడినది. ఈ రెండింటి సంయోగము లోకములో నెవరి మనస్సున కాశ్చర్యముతో నుల్లాసమును గూర్పదు – అని కావ్యము నుపక్రమించుచు మరల స్మరించినాఁడు.

**కాళిదాసు :**

శ్లో॥ ఇతి బ్రువాణాం స్మరబాణభిన్నః – స నిస్సపత్నో మనుజేంద్రపత్నీమ్ ।
మనోజ్ఞహాసాం కృతహాసమేనామ్ – పునర్బభాషే ప్రతిషిద్ధభాషీ ॥ (రా.పా. 5-29)

ఈ కవిరాజు శ్లోకము చదువునప్పుడు కాళిదాసుని

శ్లో॥ తతో మృగేంద్రస్య మృగేంద్రగామీ – వధాయ వధ్యస్య శరం శరణ్యః ।
జాతాభిషంగో నృపతిర్నిషంగా – దుద్ధర్తుమైచ్ఛత్ ప్రసభోద్ధృతారిః ॥ (రఘు-2-30)

అను శ్లోకము జ్ఞాపకము రాక మానదు.

శ్లో॥ బాలేందువక్రాణ్యవికాసభావా – ద్బభుః పలాశాన్యతిలోహితాని ।
సద్యో వసంతేన సమాగతానాం – నఖక్షతానీవ వనస్థలీనామ్ ॥ (కుమార – 3-29)

ఎక్కువ వికసింపకుండ బాలచంద్రరేఖలవలె నున్న మోదుగుపూవులు వసంతుని (నాయకుని) తోఁగలిసిన వనస్థలుల (నాయికల) నఖక్షతములవలె నెఱ్ఱగా నున్నవని కాళిదాసు వర్ణించినాఁడు.

శ్లో॥ పయోదకాలేన సముద్రగానాం - కాలుష్యముత్పాద్య సముజ్ఝితానామ్ ।
నవా నఖాంకా ఇవ రేజురుక్ష్ణాం - శృంగాగ్రరేఖాస్తటసీమ్ని లగ్నాః ॥ (రా.పా. 5-80)

వర్షాకాలము వెళ్ళి శరత్కాలము వచ్చినది. నదులు (నాయికలు) సన్నపడి సముద్రుని (ధనవంతుఁడగు నాయకుని) చేరినవి. ఆ నదీతటములం దాఁబోఁతులు గోరాడి కొమ్ములతో గీసినవి. ఆ గీతలు కాలుష్యమును విడిచిపెట్టిన నదుల (నాయికల) స్తనతటములపైఁ గ్రొత్త నఖక్షతములవలె నున్నవని కవిరాజు వర్ణించినాఁడు.

శ్లో॥ సోఽహమాజన్మశుద్ధానా, మాఫలోదయకర్మణామ్ ।
ఆసముద్రక్షితీశానా, మానాకరథవర్త్మనామ్ ॥ (రఘు 1-5)

ఈ శ్లోకములోఁ గాళిదాసు 'ఆఙ్ మర్యాదాభివిధ్యోః' (1-1-3) అని 'ఆఙ్' ఉపసర్గముతోఁ గూడిన నాలుగు సమాసములు వాడినాఁడు. దీనికి ముచ్చటపడి కవిరాజు రెండు మూఁడు తావులలో ననుకరించినాఁడు.

శ్లో॥ ఆప్రాచ్యాజ్జహ్నుకన్యా జలభరజనితాడంబరాదంబురాశే-
రా చ ప్రత్యగ్రచైత్రానిలచలితలతాస్పందినశ్చందనాద్రేః ।
ఆపాశ్చాత్యాచ్చ లక్ష్మీపతిరచితనిజావాసముద్రాత్ సముద్రా-
దా చ స్వః స్వోదరేభ్యస్తముదజుషత భూరుత్తరేభ్యః కురుభ్యః ॥ (3-12)

శ్లో॥ ఆభూమండలమాపయోధివలయాదాచక్రవాలాచలా
దాతారాపథమాపురందరపదాదాపద్మసద్మాలయాత్ ।
ఆబ్రహ్మాండకటాహకర్పరపుటం తూర్ణం జుఘూర్ణే భయ-
భ్రామ్యద్దిక్కరికీర్ణభూమివలయైర్భేరీరవై ర్భైరవైః ॥ (8-9)

ఆఙుపసర్గములతోఁ గూడిన సమాసములు సుందరమైన ప్రౌఢప్రయోగములని భావించి ప్రాచీనకవులు మఱి కొందఱు ప్రయోగించినారు.

శ్లో॥ ఆశైలాదద్రికన్యాచరణకిసలయన్యాసధన్యోపకంఠా-
దారక్షోనీతసీతాముఖకమలసముల్లాసహేతోశ్చ సేతోః ।
ఆ చ ప్రాచ్యప్రతీచ్య క్షితిధరయుగళాదర్కసోమావతంసా-
న్మీమాంసాశాస్త్రయుగ్మశ్రమముదితమనా మృగ్యతామ్ మాదృశోఽన్యః ॥

- యామునాచార్యులు.

శ్లో॥ ఆలంకానాథనారీస్తనతరళపయోవీచిముద్రాత్ సముద్రా-
దాస్వర్గంగాతరంగావళివిరళశిలాదుస్తరాదుత్తరాద్రేః ।

ఆప్రాక్ఛైలాసురస్త్రీసురతగతివిదో మగ్నభాస్వన్మృగాంకా
దా చ ప్రాచేతసాబ్ధేర్భవతు మమపురః కోఽపి యద్యస్తి వీరః ॥

– ఉమాపతిధరుఁడు (సదుక్తి – 5–18–4)

శ్లో॥ ఆమూలాద్రత్నసానోర్మలయవలయితా దా చ కూలాత్ పయోధే-
ర్యావంతః సంతి కావ్యప్రణయనపటవస్తే విశంకం వదంతు ।
మృద్వీకామధ్యనిర్యన్మసృణరసఝరీమాధురీభాగ్యభాజాం
వాచామాచార్యతాయాః పదమనుభవితుం కోఽస్తి? ధన్యో మదన్యః ॥

– జగన్నాథపండితరాయలు (భామినీ – 4–26; రసగంగా 1–గర్వోదాహరణము)

శ్లో॥ ఆచక్రాయుధ మా చ మామకగురోరాచార్యవర్గమ్ భజే
మధ్యస్థైరిహ నాథ యామునముఖైర్మాన్యైః సనాథీకృతమ్ ।
క్షీరామ్భోధిసుతాపయోధరపయః పూరా ఇవోదిత్వరా
యద్వాచాం విసరా జగంతి నితరాముజ్జీవయంతి స్వయమ్ ॥

– వేంకటాధ్వరి (లక్ష్మీ 1–4)

**భారవి :**

శ్లో॥ స్ఫుటతా న పదైరపాకృతా – న చ న స్వీకృతమర్థగౌరవమ్ ॥ (కిరాత 2–27)

ఇక్కడ నర్థగౌరవము స్వీకరింపఁబడకుండ లే దనఁగా స్వీకరింపఁబడినదే యని యర్థము. 'ద్వౌ నఞౌ ప్రకృతార్థం గమయతః' రెండు నకారములు ప్రకృతార్థమునే యిచ్చుచున్నవి.

**శ్లో॥దశాననస్యాపి దశా న న స్యా – దముష్య దీనాహతబంధుసూనోః ॥** – (రా.పా. 7–30)

దశాననస్యాపి – రావణునకుఁ గూడ నిట్టి దీనదశ రాదని కాదు. తప్పక వచ్చునని భావము. ఇక్కడఁ గూడ రెండు నకారములు ప్రకృతార్థమును దృఢము చేయుచున్నవి. కవిరాజు 'దశానన – దశా – న – న' యని యమకములో బిగించుట మిక్కిలి చమత్కారముగా నున్నది.

**సుబంధుఁడు – బాణుఁడు :**

ఈ కవిరాజునకు సుబంధుఁడు (5 శ), బాణభట్టు (7 శ) ఇష్టమైన కవులు. సుబంధుఁడు వాసవదత్తా కథాకర్త. బాణుఁడు కాదంబరీకర్త. ఈ కావ్యములు రెండును శ్లేషోక్తులతో నిండినవి.

**శ్లో॥ సుబంధుర్బాణభట్టశ్చ కవిరాజ ఇతి త్రయః ।
వక్రోక్తిమార్గనిపుణాశ్చతుర్థో విద్యతే వా నవా ॥** (1–41)

సుబంధుఁడు, బాణుఁడు, కవిరాజు వీరు ముప్పురే వక్రోక్తి నిపుణులు. నాల్గవ కవి యున్నాఁడో లేఁడో సందేహమఁట!

ఇక్కడ వక్రోక్తి యనఁగా నలంకారము కాదు. శ్లేషోక్తులతోఁ గూడిన వక్రత. లేదా కుంతకుఁడు చెప్పిన కావ్యజీవితమైన వక్రోక్తి. కవిరాజునకుఁ బ్రస్తుతమవసరమైనది శ్లేషవక్రోక్తియే కదా!

**బిల్హణుఁడు :**

1. విక్రమాంకదేవచరిత్రము 2. కర్ణసుందరీ నాటిక 3. బిల్హణస్తవము (శివస్తుతి) 4. చోరపంచాశిక మొదలగు కృతులు రచించిన బిల్హణకవి సుప్రసిద్ధుఁడు. ఇతఁడు కాశ్మీరములోఁ బుట్టి భారతదేశ మంతట పర్యటించి కర్ణాటకదేశమునకు వచ్చి త్రిభువనమల్లుని (విక్రమార్కుఁడు - 6) (1071-1127) యాస్థానములో స్థిరపడినవాఁడు. విక్రమాంకదేవచరిత్రము త్రిభువన మల్లుని చరిత్రమే. కవిరాజు బిల్హణుని కావ్యములను బాగుగాఁ జదివి యుండును. విక్రమాంకదేవచరితము నుండి యొక శ్లోకపాదమును యథాతథముగా గ్రహించినాఁడు.

శ్లో॥ సాహిత్యపాథోనిధిమంథనోత్థం - కర్ణామృతం రక్షత! హే కవీంద్రాః!
యదస్య దైత్యా ఇవ లుంఠనాయ - కావ్యార్థచోరాః ప్రగుణీభవంతి ॥

శ్లో॥ గృహ్ణంతు సర్వే యది వా యథేష్టం - నాస్తి క్షతిః కాఽపి కవీశ్వరాణామ్ ।
రత్నేషు లుప్తేషు బహుష్వమర్త్యై - '**రద్యాపి రత్నాకర ఏవ సింధుః**' ॥

- (విక్రమాంక 1-11,12)

ఈ శ్లోకములు కువలయానందములో నాక్షేపాలంకార సందర్భములో నుదాహరింపఁ బడినవి.

శ్లో॥ రాజేంద్రవేషాపగమేఽపి నైనం - సౌభాగ్యలక్ష్మీః శ్లథయాం బభూవ ।
సురాసురైః స్వీకృతరత్నరాశి - "**స్తథాపి రత్నాకర ఏవ సింధుః**" ॥ (రా.పా. 3-30)

ఉత్తరార్ధములోని భావము రెండింట సమానమే.

**ధనంజయుఁడు :**

ధనంజయుఁడు ముంజుని యాస్థానకవి. ఈ ముంజుఁడు (974-985) ధారా నగరమును బాలించిన వాఁడు. సింధులుని తమ్ముఁడు. భోజునకుఁ బినతండ్రి. భోజుని బాల్యములోఁ జంపించుటకుఁ బూనుకొనిన ప్రబుద్ధుఁడీతఁడే. ధనంజయుఁడు రచించిన రాఘవపాండవీయము కంటెఁ దనకావ్యమే మిన్నగా నుండవలెనని కవిరాజు పునఃపాకమున కుపక్రమించినాఁడు.

శ్లో॥ శ్రీవిద్యాశోభినో యస్య శ్రీముంజాదియతీ భిదా ।
ధారాపతి రసావాసీ దయం తావ ద్ధరాపతిః ॥ (రా.పా. 1-18)

శ్రీవిద్యచే శోభించు కామదేవునకు ముంజునకు నిదే భేదము. ముంజుఁడు ధారానగరమునకు మాత్రమే యధిపతి. కామదేవుఁడు ధరామండలమున కంతటికి మహారాజు. ముంజుని కంటెఁ గామదేవుఁడే గొప్పవాఁడని భావము. దీని వలన ముంజుని యాస్థానకవి యగు ధనంజయునికంటె, కామదేవుని యాస్థానకవి యగు తానే (కవిరాజే) ఘనుఁడని ధ్వని.

ధనంజయుని రాఘవపాండవీయము కృతికర్త పేరుతో ధనంజయాంకము. కవిరాజు రాఘవపాండవీయము కృతిభర్త పేరుతోఁ గామదేవాంకము.

భారవి కిరాతార్జునీయము లక్ష్మీపదలాంఛనము. మాఘుని శిశుపాలవధము శ్రీచిహ్నకావ్యము.

శ్రీశ్రీహర్షుని నైషధీయచరితము, నారాయణ పండితుని సుమధ్వ- విజయము, తెలుఁగులోఁ దిక్కన గారి భారతము నానందాంక కావ్యములు. ఇది యొక విధమగు చమత్కారము.

**కవిరాజు – పింగళి సూరన**

సంస్కృతములోఁ గవిరాజు వలెనే తెలుఁగులో రాఘవ పాండవీయమును రచించిన పింగళి సూరన సుప్రసిద్ధుఁడు. రెండర్థముల ప్రబంధమును నిర్మించుట మిక్కిలి కష్టమని యిద్దఱును జెప్పినారు.

శ్లో॥ పదమేకమపి శ్లిష్టం వక్తుమ్ భూయాన్ పరిశ్రమః ।
కథాద్వయైకనిర్వోఢుః కిం ధరాపతితోఽధికమ్ ॥ (రా.పా. 1-39)

శా॥ రెండర్థంబుల పద్యమొక్కటియు నిర్మింపంగ శక్యంబు గా
కుండుం దద్గతిఁగావ్యమెల్లనగునే యోహో! యనం జేయదే?
పాండిత్యంబున నందునం దెనుఁగు కబ్బం బద్భుతం బంద్రు ద
క్షుండెవ్వాఁడిల? రామభారతకథల్ జోడింప భాషాకృతిన్ (రా.పా. 1-10)

వీరిద్దఱు నవలంబించిన శ్లేషపద్ధతుల నెవరికి వారే యిట్లు చెప్పుకొనినారు.

శ్లో॥ ప్రాయః ప్రకరణైక్యేన విశేషణవిశేష్యయోః ।
పరివృత్త్యా క్వచిత్ తద్వదుపమానోపమేయయోః ॥

శ్లో॥ క్వచిత్ పదైశ్చ నానార్థైః క్వచిద్వక్రోక్తిభంగిభిః ।
విధాస్యతే మయా కావ్యం శ్రీరామాయణభారతమ్ ॥ (1-37,38)

సీ॥ ఆంధ్రభాషాసంస్కృతాభిభాషాశ్లేష
యొక్కొకచోట నొక్కొక్క చోట
నుచితశబ్దశ్లేష యొక్కొక్కచోట న
ర్థశ్లేష యొక్కొక్క తఱిని ముఖ్య
గౌణవృత్తి శ్లేష ఘటన యొక్కొక తఱి
నర్థాన్వయము వేఱె యగుచు నునికి
శబ్దాన్వయవిభేదసంగతి యొక్కొక్క
తఱి నివి యొక్కొక్క తఱిని రెండు

తే.గీ. మూఁడు గూడుట యన సముజ్జ్వలముగాఁగ
నాకుఁదోఁచిన గతిఁ బెక్కు పోక లమర
రామభారతకథలు పర్యాయదృష్టిఁ
జూచు సుమతుల కేర్పడ నాచరింతు (రా.పా. 1-17)

ఇరువురు కవులు వేఁట, యజ్ఞము, స్వయంవరము, ఋతువు, యుద్ధము, మొదలగు సమాన ఘట్టములను జోడించినారు. కవిరాజు, సూరన కూడ గౌతమగోత్రులే. ఇరువురు పూర్వకవుల

నెక్కువగా ననుకరింపని స్వతంత్రులే. కాని రాఘవపాండవీయ రచనలోఁ గవిరాజు ప్రభావము పింగళి సూరనపై నేమాత్రమును లేదు.

ఆంధ్రసాహిత్యములో **శ్రీనాథకవిరాజు** (15శ) మన **కవిరాజును** బ్రస్తుతించినాఁడు.

తే.గీ. రాజశేఖరుఁ గవిరాజుఁ బ్రస్తుతించి (శృం.నై. 1-7)

**ఛందోవైవిధ్యము**

వాల్మీకి, వ్యాసుఁడు, కాళిదాసు మొదలగు సంస్కృతకవులు సర్గమంతట నొకే ఛందస్సును వాడి సర్గాంతములో భిన్నమైన శ్రావ్యవృత్తము నుపయోగించినారు. భారవి, మాఘుఁడు మొదలగువా రొకే సర్గములో ననేక వృత్తములు వాడిన సందర్భములు గలవు. దక్షిణభారతములోఁ జంపూ పద్ధతి యెక్కువ ప్రచారములో నుండుటచేఁ గర్ణాటాంధ్రకవు లొకే యాశ్వాసములో ననేక చ్ఛందస్సులను వాడినారు. రాఘవపాండవీయము చంపూకావ్యము కాకపోయినను గవిరాజొకే సర్గములో విభిన్న వృత్తములు వాడినాఁడు. ఛందోదృష్టితోఁ బరికించినను రాఘవపాండవీయము నకు విశిష్టస్థానము గలదు.

1. అనుష్టుప్పు (శ్లోకము లేక పద్యము) :

సంస్కృతము నందు వృత్తము లన్నియు శ్లోకములే యైనను శ్లోక మనునది యనుష్టుప్పునకుఁ బర్యాయము. సంస్కృతవాఙ్మయములో ననుష్టుప్పునకున్నంత ప్రచారము మఱి దేనికిని లేదు. అనుష్టుప్పద్యములో నాలుగు పాదము లుండును. ప్రతిపాదమునకు 8 అక్షరములుండును.

**శ్లో॥ పంచమం లఘు సర్వత్ర, సప్తమం ద్విచతుర్థయోః ।**
**షష్ఠం గురు విజానీయా, దేతత్పద్యస్య లక్షణమ్ ॥**

అని కాళిదాసుని శ్రుతబోధము.

నాలుగు పాదములందు 5వ యక్షరము లఘువుగా, 6వ యక్షరము గురువుగా నుండవలయును. 2,4 పాదములలో 7వ యక్షరము గురువుగా నుండవలెను. ఇది యనుష్టుబ్లక్షణము.

శ్లో॥ స్వాధిష్ఠానాంబుజరజః, పుంజపింజరమూర్తయే ।
ఇచ్ఛాధీనజగత్సృష్టి, కర్మణే బ్రహ్మణే నమః ॥ (రా.పా. 1-1)

సంస్కృతములో గ్రంథశ్లోకసంఖ్య చెప్పునప్పుడు 32 అక్షరములు చొప్పున లెక్కింతురు.

**2. అపరవక్త్రము (విషమవృత్తము) :**

శ్లో॥ అథ సురరిపురాజపుత్త్రయో - స్త్రిభువనవిస్మయనీయకర్మణోః ।
సమజని సమరోత్సవస్తదానీం - జ్వలదమలాస్త్రనిరంతరాంబరాంతః॥ (9-22)

పూర్వార్ధములో (1,2 పాదములలో) వైతాళీయము; ఉత్తరార్ధములో (3-4 పాదములలో) పుష్పితాగ్ర యుండుటచే నిది **యపరవక్త్రమని** ప్రేమచంద్రవ్యాఖ్య. గాథ యను **విషమపదవృత్తమని** దామోదర వ్యాఖ్య.

ఈ పద్యములో 1వ పాదములో 'న-న-న-ర-లగ' గణములు; 2వ పాదములో 'న-జ-జ-ర' గణములు; 3వ పాదములో 'న-న-ర-య' గణములు; నాల్గవ పాదములో 'న-జ-జ-ర-గ' గణములు గలవు. నాలుగు పాదములు భిన్నముగా నుండుటచే నిది విషమవృత్తమే.

3. ఇంద్రవజ్ర (త-త-జ-గగ) :

శ్లో॥ విస్తారితాగాబ్ధిపురవనాంతామ్ । (1-45)

4. ఉపజాతి (ఇంద్రవజ్ర+ఉపేంద్రవజ్ర) :

శ్లో॥ పురాణరామాయణభారతాది - క్షీరాణి సంయోజితభక్తవత్సైః ।
పురాతనైర్యా దుదుహే కవీంద్రైః - సా భారతీ కామదుఘా మమాస్తు ॥ (1-12)

ఈ శ్లోకములో 1,3 పాదములలో 'జ-త-జ-గగ' గణములు వచ్చుటచే నుపేంద్రవజ్రము. 2,4 పాదములలో 'త-త-జ-గగ' గణములు వచ్చుటచే నింద్రవజ్రము. ఇవి రెండును గలియుటచే నుపజాతి. పాదాంతాక్షరము లఘువుగూడఁ బాక్షికముగా గురువగుటచే 'స్తు' గురువే.

5. ఉపేంద్రవజ్ర (జ-త-జ-గగ) : విచిత్రవీర్యస్య దివంగతస్య । (1-51)

6. ఔపచ్ఛందసికము (వైతాళీయము) :

శ్లో॥ పరికల్పితకామదేహదాహం । (1-79)

ఇది వైతాళీయభేదమగు **నౌపచ్ఛందసికమ**ని ప్రేమచంద్ర వ్యాఖ్య. **మాలభారిణి** యని దామోదరవ్యాఖ్య.

7. ద్రుతవిలంబితము (న-భ-భ-ర) :

శ్లో॥ గురుకృపోపనతాయుధవిద్యయా । (1-74)

8. పుష్పితాగ్ర (న-న-ర-య + న-జ-జ-ర-గ) :

శ్లో॥ అథ నృపతిరుపేత్య మిత్రవర్గై - ర్హరిబలభద్రముఖైః ప్రణీతమంత్రః ।
అవగతరిపురాత్మచక్రవృద్ధ్యా - నిజవిజయోచితయత్నమన్వతిష్ఠత్ ॥ (7-1)

బేసి (1,3)పాదములలో 'న-న-ర-య' గణములు; సరి (2,4) పాదములలో 'న-జ-జ-ర-గ' గణములు వచ్చినచోఁ బుష్పితాగ్ర.

9. పృథ్వి (జ-స-జ-స-య-లగ) :

శ్లో॥ స్వవేగచలితోచ్చలత్ ఖగమృగాహిడింబావళీ (1-83)

10. ప్రమితాక్షర (స-జ-స-స) :

శ్లో॥ అభియోక్తుమాత్మవిశిఖేన శివం (5-12)

11. ప్రహర్షిణి (మ-న-జ-ర-గ) :

శ్లో॥ ఏతస్మిన్ సతి సమయే విపక్షభీతాః । (5-63)

12. మంజుభాషిణి (స–జ–స–జ–గ) :

శ్లో॥ స్ఫురద్దృశ్యశృంగవితతాన్యథాన్వహమ్ (1–66)

13. మందాక్రాంత (మ–భ–న–త–త–గగ) :

శ్లో॥ కూర్మాకారం చరణయుగళం ధూతదిగ్దంతిశుండా । (1–27)

14. మాలభారిణి (స–స–జ–గగ + స–భ–ర–య) :

శ్లో॥ పరికల్పితకామదేహదాహం – విషయమ్ ప్రాప్య స వారణావతంసః ।
అవిశంకమువాస తత్ర భాస్వద్ – ద్యుతిలాక్షాభవనే ప్రదోషరుద్ధః ॥(1–79)

బేసి (1–3) పాదములలో 'స–స–జ–గగ' గణములు; సరి (2–4) పాదములలో 'స–భ–ర–య' గణములు వచ్చుటచే మాలభారిణి. దశమసర్గములో నీవృత్తము లెక్కువగా నున్నవి.

15. మాలిని (న–న–మ–య–య) :

శ్లో॥ ఉపనతజనక్షప్తః శ్లాఘ్యమార్గే చ తస్మిన్ । (1–80)

16. రథోద్ధత (ర–న–ర–లగ) :

శ్లో॥ ఛత్రచంద్రమసి యస్య నిర్మలే । (1–32)

ఈ వృత్తములు పంచమసర్గములో నెక్కువగాఁ గలవు.

17. రుచిర (జ–భ–స–జ–గ) :

శ్లో॥ దురానమం ధనురిదమీశ్వరాదృతే । (2–20)

ఇదం చ వృత్తం రౌద్రవీరరసయోరత్యనుకూలమిత్యమునైవ ప్రాయేణ కవయో యుద్ధం వర్ణయంతి (4–16).

ఈ వృత్తము రౌద్ర – వీర రసములకెక్కువ యనుకూలమైన దగుటచేఁ బ్రాయికముగాఁ గవులీ వృత్తముతోనే యుద్ధమును వర్ణించుచున్నారు – అని ప్రేమచంద్రవ్యాఖ్య. చతుర్థసర్గములో 'రుచిరా' వృత్తము లెక్కువగా నున్నవి.

18. వసంతతిలక (త–భ–జ–జ–గగ) :

శ్లో॥ రత్నావతంస ఇవ భారతమండలస్య । (1–49)

ప్రాయికముగా సుప్రభాత స్తోత్రములీ ఛందస్సులోనే యున్నవి.

19. వంశస్థము (జ–త–జ–ర) :

శ్లో॥ నృపేణ కన్యాం జనకేన దిత్సితామ్ । (2–1)

20. శార్దూలవిక్రీడితము (మ–స–జ–స–త–త–గ) :

శ్లో॥ జ్ఞానం జృంభయతి శ్రియం విశదయత్యానందముద్దీపయ(త్యా ।) (1–34)

21. శాలిని (మ–త–త–గ) : శ్లో॥ ఏవం కాలే యాతి భగ్నారిరక్షో । (1–76)

22. శిఖరిణి (య-మ-న-స-భ-లగ) :

శ్లో॥ అనర్ఘ్యన్యాః కావ్యేష్వలసగతయః శాస్త్రగహనే । (1-47)

23. స్రగ్ధర (మ-ర-భ-న-య-య-య) :

శ్లో॥ ఆదిత్యస్యాన్వవాయో జయతి రఘుపతేర్జన్మనోజ్జృంభితశ్రీః ॥ (1-23)

24. స్వాగత (ర-న-భ-గగ) :

శ్లో॥ దుర్నివారమపరైర్ధరణీశః । (8-38)

25. హరిణి (న-స-మ-ర-స-లగ) :

శ్లో॥ విధిమనుచరన్ ప్రాగ్వంశస్థస్తథా స మహీపతిః । (3-14)

ఈ కావ్యములో నొక సర్వతోభద్ర బంధము (13-60), ఒక చక్రబంధము (13-61) కలవు. సర్వతోభద్రమును గత ప్రత్యాగతము (ఏ పాదమున కాపాదము) అని కూడ దామోదర ఝూ పేర్కొనినారు. చక్రబంధము నందలి మూఁడవ వలయములో – **'కవిరాజ కావ్యమ్'** అని వచ్చినది.

**వ్యాకరణ ప్రయోగములు**

సూర్యాచంద్రమసోః (1-7); మధ్యే సభమ్ (2-19); మధ్యే నగరమ్ (3-34); మధ్యే పయోరాశి (7-8); ప్రతస్థివాన్ (3-28); సమీయివాన్ (3-37); ఉపేయివాన్ (13-7); అసూర్యం పశ్య (3-34); అరుంతుద (3-45); కుక్షింభరి (9-5); యమసాత్కృతేన (5-4); యమసాచ్చకార (12-18); ఈక్షమీక్షమ్ (5-22); భ్రామమ్ భ్రామమ్ (9-17); పరశ్శతమ్ (10-17); తే ఉభే (12-5); దంతాదంతి, కచాకచి, తలాతలి (12-6); ఉక్షాంచక్రతుః (12-46) మొదలగు ప్రయోగములు వైయాకరణులను మురిపించునవి. మచ్చునకుఁ గొన్ని ప్రయోగములకు వ్యాకరణ ప్రక్రియ చూపుచున్నాను.

**1. తే ఉభే రాజసైన్యే (12-5) : ఈ దూ దేద్ ద్వివచనమ్ ప్రగృహ్యమ్** (1-1-11) ఈ – ఊ – ఏ వర్ణము లంతము నందుఁగల ద్వివచనరూపములకుఁ బ్రగృహ్యమని సంజ్ఞ. 'తే' అనునది 'తత్' శబ్దమునకు ద్వివచనరూపము. ఈ ప్రగృహ్యముల కచ్చు పరమగునపుడు ప్రకృతిభావము వచ్చి సంధి యుండదు. **'తే ఉభే'** అనియే యుండును.

**2. 'ప్రతస్థివాన్' సావరజః సదారః (3-28) : 'సమీయివాన్' సావరజో మునీంద్రైః' (3-37) : 'ఉపేయివాన్' సంయుగధామ రామః (13-7) : భాషాయాం సదవసశ్రువః** (3-2-108); **ఉపేయివాననాశ్వాననూచానశ్చ** (3-2-109) అను సూత్రములచే విధింపఁబడిన 'క్వసు' ప్రత్యయాంతములు.

తం తస్థివాంసం నగరోపకంఠే (రఘు-5-61) అని కాళిదాసు.

**3. ఆకాశ 'కుక్షింభరిభిః' పృషత్కైః (9-5) :** ఫలే గ్రహిరాత్మంభరిశ్చ (3-2-26) అను సూత్రములో నిపతింపఁబడినది. చ కారముచేఁ గుక్షిని గ్రహింపఁగాఁ గుక్షింభరి యగును.

చాత్ కుక్షింభరిః। చాం(ద్రాస్తు - ఆత్మోదరకుక్షిష్వితి పేఠుః । జ్యోత్స్నాకరంభ-ముదరంభరయశ్చకోరాః - ఇతి మురారిః ॥ అని సిద్ధాంతకౌముది.

**ఆత్మంభరి, కుక్షింభరి, ఉదరంభరి –** మూఁడును సాధువులే. ఆకాశమునే కడుపులో నింపుకొను బాణము లని యర్థము.

**4. దంతాదంతి కచాకచి (ద్రుతమభూద్యుద్ధం తలాతల్యపి (12-6) :** దంతైః దంతైః (ప్రపీడ్య, కచైః కచైః ఆకృష్య, తలైః తలైః (ప్రహృత్య - ఇదం యుద్ధమ్ (ప్రవృత్తమ్ - అను వి(గ్రహమున; **త(త తేనేదమితి సరూపే (2-2-7)** అను సూ(త్రముచే బహు(వ్రీహి సమాసమునందు; **అన్యేషామపి దృశ్యతే (6-3-137)** అను సూ(త్రముచేఁ బూర్వపదాంతమునకు దీర్ఘము వచ్చి; ఇచ్ కర్మవ్యతిహారే (5-4-127) అను సూ(త్రముచే సమాసాంతముకు 'ఇచ్' (ప్రత్యయము వచ్చి దంతాదంతి మొదలగు రూపము లేర్పడును. తన దంతములతో శ(త్రువు దంతములను బీడించి; ఒకరి జుట్టు నొకరు పట్టుకొని, ఒకరి కరతలముతో మఱియొకరిని చెంపకాయలు కొట్టుచుఁ (బవర్తిల్లిన యుద్ధమని భావము.

**5. తామీక్షమీక్షమితి తర్కపరః స రాజా (5-22) : (భ్రామమ్ (భ్రామమ్ (ప్రథనపృథివీమండలే చండవేగః** (9-17) : ఈక్ష - దర్శనే; (భమ - చలనే - అను ధాతువులకు '**ఆభీక్ష్ణ్యే ణముల్ చ**' (3-4-22) అను సూ(త్రముచే 'ణముల్' (ప్రత్యయము క్త్వార్థములో వచ్చి 'ఈక్షమ్' - '(భ్రామమ్' అను రూపములేర్పడును. ణములంతము లెప్పుడును జంటలు జంటలుగా (ప్రయోగింపఁబడును. ఈక్షమీక్షమ్ - ఈక్షిత్వా ఈక్షిత్వా (చూచి చూచి), (భ్రామమ్ (భ్రామమ్ - (భమిత్వా (భమిత్వా (తిరిగి తిరిగి)

**6. ఉక్షాంచ(క్రతురశ్వినోశ్చ తనయౌ క్షోణీం ద్విషచ్ఛోణితైః (12-46) :** ఉక్ష-సేచనే-భ్వాదిధాతువు. డుకృఞ్ -కరణే-తనాది ధాతువు. చకార-చ(క్రతుః - చ(క్రుః - అనునది కృఞ్ ధాతు - లిట్ - (ప్రథమపురుష - ద్వివచనరూపము.

**కృఞ్ చాను(ప్రయుజ్యతే లిటి** (3-1-40) అను సూ(త్రముచే 'ఉక్ష' ధాతువునకు - 'చ(క్రతుః' అను (ప్రయుక్తమై 'ఉక్ష+చ(క్రతుః' అని యైనది. **ఇజాదేశ్చ గురుమతోఽనృచ్ఛః** (3-1-15) అను సూ(త్రముచే ధాతువునకు 'ఆమ్' (ప్రత్యయము చేరి ఉక్ష+ఆమ్+చ(క్రతుః - **ఉక్షాఞ్చ(క్రతుః** - అని యైనది. అశ్వినీదేవతల కుమారులగు మైంద - ద్వివిదులు (నకుల - సహదేవులు) శ(త్రు రక్తపాతములచే యుద్ధభూమినిఁదడిపిరని భావము. ఇట్లే తక్కిన (ప్రయోగముల (ప్రక్రియ తెలియవలయును.

(ప్రేమచం(ద వ్యాఖ్యలోఁ గాని, దామోదర వ్యాఖ్యలోఁగాని సూ(త్ర(ప్రదర్శన పూర్వకముగా వ్యాకరణ(ప్ర(క్రియలేకపోవుట పెద్దలోపమే. మూలకావ్యకర్తతోఁ బోటీపడి వ్యాఖ్యానములో సకలశాస్త్ర విషయములు సమీకరించుట శ్రీమల్లినాథమహోపాధ్యాయునకే చెల్లినది.

# శ్రీరాఘవపాణ్డవీయమ్

## అపూర్వపదప్రయోగము

1. దత్తయః కీర్తయశ్చైవ (1-15)

దత్తి (సం) - ఈవి, దానము - అని సూర్యరాయాంధ్రనిఘంటువు

2. వ్యరాజతాం వ్యోమని పుష్పవంతౌ (5-76)

పుష్పవంతౌ - సూర్యచంద్రులు. ఏకయోక్త్యా పుష్పవంతౌ దివాకరనిశాకరౌ - అని యమరము.

3. ఘంటాటంకార ఘో'**రోత్తురుక**' కరిఘటాసంకటక్షోణిపీఠం 'ఘాటీభి'ర్ఘోటకానాం ఝటితి ఖరఖురోద్ధూతధూళీవితానమ్ ॥ (10-3)

ఉత్తురుకము = ఒక విధమైన వాద్యము. ఘాటీ = సమూహము - అని దామోదరవ్యాఖ్య.

ఘంటాటంకారఘో'రోడ్డమర'కరిఘటాసంకటక్షోణిపీఠం ధాటీభిర్ఘోటకానాం ..... అని ప్రేమచంద్ర పాఠము.

ఉడ్డమరాః = ఉద్భటాః ధాటీభిః = ప్రపాతైః । సమూహై రితి కేచిత్ - తత్ర కోశో మృగ్యః - అని ప్రేమచంద్ర వ్యాఖ్య.

4. ఆనేతా మధ్యదేశాత్ ప్రవచనవిదుషాం సోమపాం బ్రాహ్మణానామ్ (1-25) :

సోమపామ్ = సోమరసపానము చేసిన వారియొక్క యని షష్ఠీ బహువచనరూపము. 'విశ్వపామ్' వంటిది.

సోమపామ్ = సోమయాగాదౌ సోమలతారసపాయినామ్. ధాతోరాల్లుక్ శసాద్యచీత్యాకారలోపః। అని ప్రేమచంద్ర వ్యాఖ్య. 'సోమపబ్రాహ్మణానామ్' - అని దామోదర ఝా పాఠము.

## అలంకార యోజనము

కావ్యసరస్వతి కలంకారమ లాభరణముల వంటివి. రాఘవపాండవీయము శ్లేషప్రధానమైన ద్వ్యర్థికావ్యమైనను వివిధాలంకారములను గూర్చినాఁడు.

## శబ్దాలంకారములు

**1. వృత్త్యనుప్రాసము :**

శ్లో॥ నిశానిశీథినీకాంతకాంతిసంతతిసంతతాః । (5-84)

ఇక్కడ 'ంత' అను నక్షర మెక్కువ మాఱులు వచ్చుటచే వృత్త్యనుప్రాసము.

**2. ఛేకానుప్రాసము :**

శ్లో॥ కామదేవః క్షమాదేవ కామధేనుర్జనేశ్వరః । (1-13)

శ్లో॥ రోమహర్షమ్ మహర్షయః (5-3)

శ్లో॥ యశోభిరివ శోభితాః (5-84)

శ్లో॥ భేరీరవైర్భైరవైః (8-9)

ఇక్కడ 'కామ-కామ'; 'హర్ష-హర్ష'; 'శోభి-శోభి'; 'రవైః-రవైః' అని రెండేసి హల్లు లర్థభేదముతో రెండు మాఱులావృత్తమగుటచే ఛేకానుప్రాసము. ఛేకులు - విదగ్ధులు (నేర్పరులు)

3. యమకము :

శ్లో॥ ముక్తాముక్తాకలాపాః కిల తదుపరమే కేవలాః సాధువాదాః । (13-15)

ఇది పాదాది యమకము.

శ్లో॥ ఏకః శ్రీకామనామా జలనిధిలహరీ స్రగ్ధరాయాం ధరాయామ్ (1-24)

శ్లో॥ ఆపాశ్చాత్యాచ్చ లక్ష్మీపతిరచితనిజావాస ముద్రాత్ సముద్రాత్

శ్లో॥ సంప్రాప్తమ్ మేనిరే తమ్ ప్రతిభయముభయోః సంయుగాంతం యుగాంతమ్ (9-26)

శ్లో॥ రజనిచరచమూపః సంయుగాంతే యుగాంతే (11-14)

ఇవి పాదాంత యమకములు

ఇక్కడ మొదటి యుదాహరణములో 'స్రగ్ధరాయాం ధరాయామ్' అనుచోట "స్రగ్ధర" యని వృత్తనామము సూచింపఁబడుటచే ముద్రాలంకారము. దీనిని వ్యాఖ్యాతలు సూచింపలేదు.

**అర్థాలంకారములు**

**1. మాలోపమ :**

శ్లో॥ నీహారసంసిక్తమివాబ్జషండం - కల్పానలాలీఢమివార్ణవవాంభః ।
శరన్మరున్నున్నమివాభ్రబృందం - బలం కథాశేషమభూత్ పరేషామ్ ॥(4-42)

ఇది శ్రీరామునకు ఖరదూషణాదులతో; అర్జునునకు నివాతకవచులతో జరిగిన యుద్ధవర్ణనము.

మంచుచేఁ దడిసిన పద్మసమూహమువలె, ప్రళయకాలాగ్నిచేఁ ద్రాగఁబడిన సముద్రజలమువలె శరత్కాల వాయువుచేఁ ద్రోయఁబడిన మేఘసమూహమువలె ఖరదూషణాదుల (నివాతకవచుల) బలము కథావశేషమైనది. సైన్యము నష్టమైనది. దీనిలో వరుసగా 3 ఉపమలు.

శ్లో॥ పురాతిదర్పాదివ దానవస్త్రయీం - విధుంతుదః పర్వణి చంద్రికామివ ।
నదీరయస్తీరలతామివోత్ప్లవే - స తాం జహార ప్రసభేన భామినీమ్ ॥(5-38)

ప్రాచీనకాలములో మిక్కిలి గర్వముతో హయగ్రీవుఁడు వేదరాశినివలె, పున్నమనాఁడు రాహువు వెన్నెలను వలె, పొంగినపుడు నదీప్రవాహవేగమొడ్డున నున్న చెట్ల తీఁగను వలె రావణుఁడు (సైంధవుఁడు) సీతనుఁ (ద్రౌపదిని) బలాత్కారముగా నపహరించెను. 3 ఉపమలు.

శ్లో॥ శిఖావలానామివ వారివాహం - వనప్రియాణామివ చైత్రమాసమ్ ।
ఉదన్వతామిందుమివోజ్జ్రుజుంభే - ప్రీతిస్తమాలోకయతాం జనానామ్ ॥(13-31)

మేఘమును జూచిన నెమళ్ళవలె, వసంతకాలమును జూచిన కోకిలలవలెఁ, జంద్రునిఁ జూచిన సముద్రములవలె శ్రీరాముని (ధర్మరాజును) చూచిన జనులు ప్రీతి నొందిరి. 3 ఉపమలు.

**మాలారూపకము :**

శ్లో॥ సౌందర్యశ్రీపతాకా నిఖిలయువమనఃశృంఖలా లోకచక్షుః
పక్ష్మస్పందవ్యుదాసః సురమునిహృదయాకర్షణే కామపాశః ।
తారుణ్యోద్యానవల్లీ పతిసుకృతకలా కామకోదండమౌర్వీ
రేజే తద్దోర్లతాగ్రే వరవరణకృతౌ కల్పితా పుష్పమాలా ॥ (2-9)

ఇది స్వయంవరమండపములో సీత (ద్రౌపది) చేతిలో నున్న పుష్పమాలా వర్ణనము.

1. సౌందర్యలక్ష్మికి జెండా, 2. సకలయువజనమనస్సులకు సంకెల, 3. జనుల కన్నుల ఱెప్పపాటునకు నివారణము, 4. దేవతల, మహర్షుల హృదయముల నాకర్షించుటలో మన్మథపాశము, 5. యౌవనోద్యానవనమునకు లత, 6. కాఁబోవు భర్త పుణ్యమునకు వృద్ధి, 7. మన్మథుని వింటికి నారి యైన సీత (ద్రౌపది) చేతిలో నున్న పూలమాల ప్రకాశించినది. ఒకే శ్లోకములో 7 రూపకములు. ఈ విశేషణములు నాయికకు సరిపడుటచే సమాసోక్తి ధ్వని. ఈ కావ్యము నందలి యర్థాలంకారము లివి-

అతిశయోక్తి (1-8); అనుమానము (2-10); అపహ్నుతి (1-2); అప్రస్తుతప్రశంస (7-31); అర్థాపత్తి (1-36); అర్థాంతరన్యాసము (3-37); ఉత్ప్రేక్ష (1-1); ఉదాత్తము (1-52); ఉపమ (1-17); కావ్యలింగము (1-10); తద్గుణము (1-1); తుల్యయోగిత (1-26); దీపకము (1-34); దృష్టాంతము (1-48),; నిదర్శన (1-14); పరిసంఖ్య (1-28); పర్యాయము (8-9); ప్రతివస్తూపమ (4-36); ప్రతీపము (3-35); మాలాదీపకము (1-31); ముద్ర (2-24); రూపకము (1-3), (1-44); వికల్పము (5-9); వినోక్తి (5-15); విషమము (3-34); వ్యతిరేకము (2-24); శ్లేష (1-15); సమాసోక్తి (1-12)(3-36); సముచ్చయము (1-47); సహోక్తి (2-20); సందేహము (7-5); స్వభావోక్తి (5-47); హేతువు (2-9) మొదలగునవి.

**ఈ కావ్యవ్యాఖ్యలో ననేకస్థలములలో నలంకారచర్చ, ధ్వని నిరూపణము గలవు. మల్లినాథుని సర్వంకషతో మాఘకావ్యమును, ప్రేమచంద్రుని కవాటవిపాటికతో రాఘవపాండవీయమును, బెల్లంకొండవారి మందరవ్యాఖ్యతో భాగవతచంపువును నిశితముగాఁ బఠించిన వారి కలంకార-శాస్త్రమంతయుఁ గరబదరసమానమగు ననుటలో నిసుమంతయు సంశయము లేదు.**

**వ్యాఖ్యానసంపద**

ఈ రాఘవపాండవీయమునకు 1. చారిత్రవర్ధనుఁడు, 2. పద్మనందిభట్టారకుఁడు, 3. పుష్పదంతుఁడు, 4. లక్ష్మణపండితుఁడు (సారచంద్రిక), 5. విశ్వనాథుఁడు, 6. శశధరుఁడు (ప్రకాశము), 7. ప్రేమచంద్రతర్కవాగీశుఁడు (కపాటవిపాటిక), 8. దామోదరఝా (సుబోధినీ - సంస్కృతవ్యాఖ్య, సరళా - హిందీవ్యాఖ్య) యను వారలు రచించిన 8 వ్యాఖ్యలున్నట్లు తెలియుచున్నది. వీనిలో 1. లక్ష్మణపండిత, 2. శశధర, 3. ప్రేమచంద్ర, 4. దామోదర వ్యాఖ్యలు ముద్రితములు.

1. లక్ష్మణ, 2. శశధర వ్యాఖ్యలు లఘుటీకలు. 3. ప్రేమచంద్ర 4. దామోదరర్ఘాలు రచించినవి విపులవ్యాఖ్యలు. నేఁడు కాశీ – చౌఖంబా వారి దగ్గఱ లభించుచున్నది దామోదరవ్యాఖ్య. **ప్రస్తుతము పాఠకుల చేతిలో నున్నది ప్రేమచంద్రవ్యాఖ్య.**

### ప్రేమచంద్రుఁడు

ఇతఁడు తర్కవాగీశభట్టాచార్యబిరుదాంచితుఁడు. వంగరాష్ట్రవాస్తవ్యుఁడు. కలకత్తా సంస్కృత కళాశాలలో నుపాధ్యాయుఁడుగా నుద్యోగించినవాఁడు. ఈతని వ్యాఖ్యాన రచనాకాలము 1775 శక. అని కవియే చెప్పుకొనినాఁడు – శాకే సాయకసప్తశైలకుమతే వర్షేఽ తి హర్షప్రదాం చక్రే రాఘవపాండవీయవివృతిం శ్రీప్రేమచంద్రో ద్విజః । ఇది క్రీ.శ. 1852.

సంస్కృతసప్తకావ్యవ్యాఖ్యాత యగు మల్లినాథ మహోపాధ్యాయుఁడు, చంపూరామాయణ –సుభాషితత్రిశతీ వ్యాఖ్యాత యగు రామచంద్రబుధేంద్రుఁడు, చంపూభారత వ్యాఖ్యాత యగు కురవి రామకవి యెంత గొప్ప పండితులో ప్రేమచంద్రుఁడు కూడ నంతటివాఁడు. కవాటవిపాటిక మల్లినాథ మార్గములోఁ బయనించినది.

ముందుగా నన్వయక్రమములో శ్లోకార్థమును జెప్పినాఁడు. పదముల కర్థములు చెప్పునప్పుడనేక నిఘంటువుల నుదాహరించినాఁడు. పాఠాంతరములు పరిశీలించినాఁడు. సాధుపాఠములు నిర్ణయించినాఁడు. పూర్వాపరసంగతి ననుసరించి కొన్నిచోట్ల మూలకావ్యకర్తను సమర్థించినాఁడు. సందర్భములు సరిగాఁ దెలియుటకై రామాయణ – భారతాది వచనముల నుపన్యసించినాఁడు. అవసరమైన చోట్ల శాస్త్రవచనములను సూచించినాఁడు. ప్రతిశ్లోకమున కలంకారము నిర్ణయించినాఁడు. చివరగా ఛందస్సు తెలిపినాఁడు. అన్నింటికంటె ముఖ్యము – రామాయణార్థ–మును, భారతార్థమును విడివిడిగాఁ జూపినాఁడు.

**పూర్వకవులప్రయోగములు :**

1. పునాతు నః సరస్వత్యా విలాసశిశుకః శుకః (1–2) ఉపాస్యదేవతను వర్ణించుటకంటెఁ దద్గుణములను దత్పరివారమును వర్ణించుట యధికతరవైదగ్ధ్యమునకు ద్యోతకమని చెప్పి –

వైనాయక్యశ్చిరం వో వదనవిధుతయః పాంతు చీత్కారవత్యః । – (మాలతీ – 1–7)

అని భవభూతి **మాలతీమాధవ** ప్రయోగమును జూపినాఁడు.

2. ఫలంతు ఫలమీప్సితమ్ (1–4) : ఫలతి ధాతువునకు సకర్మకత్వము కూడ నుండునని చెప్పుటకై–

వాల్మీకిః ఫలతి స్మ యస్య చరితం స్తోత్రాయ దివ్యా గిరః । (అనర్ఘ 1–8)

అని మురారి **యనర్ఘరాఘవ** ప్రయోగము చూపినాఁడు.

3. ఆనేతా మధ్యదేశాత్ ప్రవచనవిదుషాం సోమపామ్ బ్రాహ్మణానామ్ । (1–25)

శివుఁడు యజ్ఞఫలప్రదాత యని చెప్పుటకు –

అతస్త్వాం సంప్రేక్ష్య క్రతుషు ఫలదానప్రతిభువమ్ (శివ–20)

అను పుష్పదంతుని **శివమహిమ్నస్తోత్రము** నుదాహరించినాఁడు.

4. తేనాగస్తిరయన్ దృష్టో వనేచరవపుః ప్రభుః (4–2)

శివుని వక్షఃస్థలముపై గ్రుద్ది యర్జునుఁడపరాధము చేసె ననుటకు

శ్లో॥ గాండీవీ కనకశిలానిభమ్ భుజాభ్యా ।
మాజఘ్నే విషమవిలోచనస్య వక్షః ॥ (కిరా 17–63)

అను భారవి **కిరాతార్జునీయ** శ్లోకము నుదాహరించినాఁడు. ఈ శ్లోకములో – 'తిరయన్' అని 'తిరయతి' ధాతువు ప్రయోగింపఁబడినది. తిరయన్ = ఆచ్ఛాదయన్ = అగణయిష్యన్ – ఇత్యర్థః – అని ప్రేమచంద్రవ్యాఖ్య. ఈ ధాతువు పాణినీయ ధాతుపాఠములో లేదు.

**స్తృణోతి తిరయత్యేవం స్తృణుతే గోపయత్యపి ।**

అని యాఖ్యాతచంద్రికలో భట్టమల్లుఁడు పఠించినాఁడు.

'తిరయతీత్యత్ర ధాతుర్మార్గణీయః । అథవా తిరధాతుః । బహులమేతన్నిదర్శనమ్ (గణసూత్రమ్) ఇత్యత్ర బహులగ్రహణస్య అదంతధాతునిదర్శనమిత్యర్థమాఖ్యాయ తిరధాతురాహరణీయః । అథవా దశగణీపాఠో బహులమిత్యర్థాంతరముపకల్ప్యాత్ర సమాధేయమ్' – అని **పూర్ణిమావ్యాఖ్య.**

భారవి శ్లోకములో '**ఆజఘ్నే**' – అను నాత్మనేపదప్రయోగము విచార్యమని వైయాకరణులు. ఇది విషయాంతరము.

శుశోచ రాజా చిత్తేన వ్యాకులేన దశాననః (10–21)

ఎక్కువ శోకము వచ్చినప్పుడు దిక్కులు కనఁబడవని చెప్పుటకు –

ముఖాని లోలాక్షి! దిశామసంశయం – దశాపి శూన్యాని విలోకయిష్యసి ॥ (నైష – 1–139)

అను శ్రీశ్రీహర్షుని **నైషధీయచరిత** ప్రయోగమును జూపినాఁడు.

**కవిసమర్థనము :**

1. **స గాఢబుద్ధిస్తమసోపి కంఠే** (1–59) : తమసా శబ్దమునకు రామాయణార్థములోఁ దమసానది యని యర్థము చెప్పక 'యర్ధరాత్ర' సమయ మని యర్థము చెప్పి కొందఱు తమసానది దగ్గఱ నని యర్థము చెప్పుచున్నారు. అది సరిగాదు. '**సరయూమన్వగాన్నదీమ్**' అని వాల్మీకి చెప్పినాఁడు. 'తత్రార్ధరాత్రసమయే మునిః కశ్చిత్ తృషార్దితః" అని యధ్యాత్మరామాయణములోఁ గలదని మూలమునకుఁ గ్రొత్తవ్యాఖ్య చెప్పి సమర్థించినాఁడు.

2. **తనయానవాప హరిదస్రతేజసః** (1–66) : ఇక్కడ 'హరి = ఇంద్రుఁడు, దస్రులు = అశ్వినీదేవతలు, వారి వంటి బలము, తేజస్సు కలవారు రామాదులని రామాయణార్థము చెప్పి; భారతార్థములో హరిదస్రాణాం = ధర్మవాయ్వింద్రాశ్వినీకుమారాణామ్, అని చెప్పి హరిశబ్దమునకు

ధర్ముఁడని యర్థమున్నదా? యని శంకించుకొని హరిశబ్దము సర్వధర్మాత్మకుఁడగు విష్ణువునకు వాచకమగుటచేతను, యమార్థ ముండుట చేతను మూలము సరియైనదే యని '**హరిర్వాతార్క-చంద్రేంద్రయమోపేంద్రమరీచిషు**' ఇతి విశ్వః – అని నిఘంటువు నుదాహరించి సమర్థించినాఁడు.

3. **అంగారవర్ణస్య జితాత్మనోఽసౌ** (2–2) : అర్జునునితో యుద్ధము చేసినవాఁ డంగారపర్ణుఁడు కాని యంగారవర్ణుఁడు కాఁడు. అంగారవర్ణుఁడు = వెలుఁగుచున్న నిప్పువంటి తేజస్సు కలవాఁడు గౌతముఁడని రామాయణార్థము. అంగారవర్ణుఁడను గంధర్వుఁడని భారతార్థము. ఇక్కడ వ్యాఖ్యాత – 'అంగారపర్ణు'ఁడనియే భారతపాఠము. అప్పుడు రామాయణార్థములో "**అంగస్య = దేహస్య; ఆరో = ధారణం యేభ్యస్తాదృశాని పర్ణాని పత్రాణి యస్య తథా తస్య**" రాలిన పర్ణములు (ఆకులు) తిని దేహధారణము చేసిన వాఁడు గౌతముఁడని చెప్పుకొనవచ్చు నని యంగారపర్ణ శబ్దమునకు రెండర్థములు సూచించినాఁడు.

4. **మహాజగరసన్నద్ధభీమసేనాభయంకరాత్ ।** (5–3) : దుర్మానసం క్షోభయతి స్మ భీమః (5–4) భారతములో ముందు యక్షయుద్ధము, (సౌగంధికాపహరణము), తరువాత నజగరోపాఖ్యానము చెప్పఁబడినవి. ఇక్కడ నజగరోపాఖ్యానము ముందు చెప్పుట దోషముగాదా? యన్నచో రామాయణార్థము కూడ సరిపడవలసిన శ్లేష నిర్బంధమున్నది కావునఁ బూర్వాపరఘట్ట విపర్యయము తప్పు కాదని సమర్థించినాఁడు.

5. **ఏవం విపక్షదూతేన** (7–28) : రామాయణములో శుక (రాక్షస) – సుగ్రీవ సంభాషణము లేదు గదా! యన్నచో శ్లేషనిర్బంధమువలన నిట్టి సందర్భములను గల్పించుట దోషము గాదని సమర్థించినాఁడు.

6. **నక్తంచరేభ్యో నిధనం నిశమ్య – శుశోచ రాజా బహు ధార్తరాష్ట్రః ।** (12–37) : భారతములో దుర్యోధనుఁడు చూచుచుండఁగనే కర్ణవధ చెప్పఁబడినది గదా! ఇక్కడ విని దుఃఖించుట యేమి? యన్నచో గూఢచారులవలన విని మరల దుఃఖించినాఁడని చెప్పుకొనవలెనని సమర్థించినాఁడు.

**మూలవిమర్శనము :**

శ్లో॥ తం తరుణ్యోఽభిషేకాంతే రాజానం నిరరాజయన్ ।
దీపైర్విద్యుత్కలాపేన మేఘమాలా ఇవాచలమ్ ॥ (13–46)

పట్టాభిషేకానంతరము శ్రీరామునకు (ధర్మరాజునకు) ముత్తైదువులు దీపములతో నీరాజన మిచ్చిరి. మేఘమాలలు మెఱుపు తీఁగెల సమూహముతోఁ బర్వతమునకు నీరాజన మిచ్చినట్లుగానని యర్థము.

'అత్ర దీపైరిత్యేకమాత్రస్య పదస్య ఉత్తరార్థపతితత్వేన అర్థాంతరైకపదత్వదోషో నలక్షితః కవీనాం నిరంకుశత్వాదితి ధ్యేయమ్' – అని యీ యొక్క తావులో మూలకావ్యము నందలి దోషమును జూపినాఁడు. 'దీపైః' అనునది బహువచనము. 'విద్యుత్కలాపేన' – అనునది యేకవచనము. బహువచనపదమునకు (దీపములకు) ఏకవచనపదముతోఁ (విద్యుత్కలాపేన) ఉపమానము చెప్పుట దోషము. '**దీపైర్విద్యుత్కలాపైశ్చ**' అని యున్నచో దోషములేదు.

**పాఠపరిశీలనము :**

1. కేచిద్దానేషు వీరాస్సమరభువి (1–24) : ఇక్కడ 'వీరాః' అనుచోట 'ధీరాః' అను పాఠము కూడ మనోరమమే.

2. ధూతదిగ్దంతిశుండా (1–27) : 'ధూత' యనుచోట 'వృత్త' యనుపాఠాంతరము గలదు.

3. తస్మిన్ గుణాకర్షణకర్మకారే (2–28)

'కర్మకారే' యనుచోట 'కర్మధీరే' యని పాఠాంతరము.

4. పరస్య శాంత్యా పునరేవ శాంతిమ్ (7–50) : 'పరస్య శాంత్యా' యనుచోట 'సకృత్ ప్రశాంత్యా' అను పాఠము సరియైనది కాదు.

5. 'తస్యవా'నరసింహస్య (9–24) : 'తస్యాథ' నరసింహస్య – అను పాఠ మందమైనది కాదు.

6. క్షణాత్ క్షణమనీయత : 'క్షణమ్। అనుచోట 'క్షయమ్' అను పాఠము కలదు. ఇది భారతపక్షములో సరిపడదు గావున మనోజ్ఞమైనది కాదు.

7. ప్రసన్నచక్షు'ర్లలిత'ం 'సలక్ష్మణః' (13–52) : 'ప్రసన్నచక్షు 'శ్చలనే' క్షణక్షణమ్ ఇతి పాఠే... ... మొదలగునవి.

**పూర్వవ్యాఖ్యానామోదము :**

కొన్ని తావులలో నితరవ్యాఖ్యాతల మతము నుట్టంకించి యర్ధాంగీకారముగా మౌనము వహించినాఁడు.

1. స్మరహరధరణీసంభవస్యాన్వవాయః (1–23)

'స్మరహర... కాదంబవంశోఽపి' అని యర్థము చెప్పి 1. 'ధరణి' యను నింటిపేరుగల స్మరహరుఁడను పూర్వరాజని కొందఱు 2. స్మరహరుఁడు = పూర్వపురుషుఁడు. అతని భార్య ధరణి' యని కొందఱు, 3. స్మరహరధరణి = కాశి. అక్కడఁ బుట్టినవాఁడని కొందఱు చెప్పుచున్నారని మూఁడు పక్షములు చూపినాఁడు.

2. ఆరోఢా మర్త్యమూర్త్యా సురపతిసదసో మండనమ్ మానవత్యాః (1–25)

ఇక్కడ 'మానవతి' యనఁగా నొక నగర మని యర్థము చెప్పి; కామదేవుని భార్య 'మానవతి' యని కొందఱు చెప్పుచున్నారని సూచించినాఁడు.

3. యం భారతశ్రీర్భుజతేఽభిరామా (1–131)

భారతశ్రీః = భారతలక్ష్మి యని యర్థము చెప్పి 1. భారతశ్రీ = భరత నృపశ్రీ యని కొందఱు 2. భా = కాంతి, రతము = సంభోగము వీనితోఁగూడిన శ్రీ యని కొందఱు చెప్పుచున్నా రని సూచించినాఁడు.

4. రోషేణ మూర్ఛన్ మకరాక్ష ఉచ్చైః (11-22)

మకర = మొసళ్ళు; అక్ష = పాములు, అని యర్థము చెప్పి మొసలి కన్నుల వంటి కన్నులు గలవాఁడశ్వత్థామ యని కొందఱు చెప్పుచున్నారని సూచించినాఁడు.

5. ఉపరిపరిపతత్ ఫేరుభేరుండతుండమ్ (13-28)

ఇక్కడ 'ఫేరు = నక్కలు, భేరుండ = యక్షిణీ దేవతలు, అని యర్థము చెప్పి, కొందఱు 'భేరుండ రుండమ్' అని పఠించి 'భేరుండ = భయంకరమైన, రుండాః = కబంధములని యర్థము చెప్పినారని సూచించినాఁడు.

'ఫేరుభేరుండదండమ్' - అని దామోదరపాఠము.

**పూర్వవ్యాఖ్యానఖండనము :**

1. పునాతు నః సరస్వత్యా విలాసశిశుకః శుకః (1-3)

ఇక్కడఁ గొందఱు 'శుక' అనుదానికి శుకదేవుఁడని యర్థము చెప్పినారు. అది తప్పు. శుక మహర్షి భాగవతప్రవక్త. వైశంపాయనుఁడు భారతప్రవక్త.

2. కుమారశక్త్యా కరదీకృతాయామ్ (3-13)

'కుమారశక్త్యా = అశ్వవానరసైన్యస్య' - అని యర్థము చెప్పి 'కుమారస్య = రామస్య' యని కొందఱు వ్యాఖ్యానించినారు. దశరథుఁడు యజ్ఞము చేయు నాఁటికి రాముఁడు పుట్టలేదు గావున నీ యర్థము తప్పని ఖండించినాఁడు.

3. నేత్రాణి రోషాదరుణత్వమాపుః (9-6)

నేత్రాణి = రామాయణార్థములోఁ గన్నులు, భారతార్థములో సేనాపతులు - అని చెప్పి కొందఱు భారతార్థములోఁగూడఁ గన్నులని యర్థము చెప్పుచున్నారు. ఒక వ్యక్తికి రెండు కన్నులే యుండును. బహువచనములో దుర్యోధనుని కన్నులని చెప్పఁగూడ దని నిరసించినాఁడు.

4. దక్షిణా దిగివ కుంభజన్మనా నాథవత్యజని వైరివాహినీ (9-59)

భీష్మపతనానంతరము కర్ణుని సేనాపతిని గావించినట్లు కొందఱు వ్యాఖ్యానించినారు. వీరు భారతమును సరిగాఁ జదువలేదు. భీష్ముని తరువాత ద్రోణుఁ డభిషేకింపఁ బడినాఁడు.

5. ఏకేన భగ్నాంఘ్రిపరంహసోచ్చైః (10-32)

ఇక్కడఁ గొంతమంది '**అంఘ్రిప**' శబ్దమునకు బదులుగా '**అంగప**' శబ్దమును గల్పించి, రామాయణ పక్షములో అంగపములు = వృక్షములు; భారతపక్షములో అంగపః = కర్ణుఁడు అని యర్థము చెప్పినారు. 'అంగపము = వృక్ష' మనుటకు నిఘంటువు మృగ్యము గావున నీ పాఠాంతరము వ్యాఖ్య సరియైనవి కావు.

6. గగనాతివిలంఘనాతివేగాద్ధరిచక్రేణ తిరోహితే పతంగే (10-37)

శ్రీకృష్ణుఁడు యోగశక్తిచే సూర్యునిఁ దిరోహితునిఁ జేసినాఁడు '**యోగమత్ర విధాస్యామి సూర్యస్యావరణమ్ ప్రతి**' – అని భారతము. సుదర్శనచక్రముచే సూర్యుని గప్పినట్లు కొందఱు వ్యాఖ్యానించినారు. అది మూలవిరుద్ధ మని ప్రేమచంద్రుఁడు చెప్పినాఁడు.

హరిచక్రేణ = శ్రీకృష్ణుని చక్రముచే నని మూలకర్త యభిప్రాయము. చంపూ భారతములోఁ గూడ నిట్లే కలదు –

శ్లో॥ తదా ప్రకాశస్య దివాకరస్య తిరోహితస్యాపి జయద్రథస్య ।
అదర్శనాయాపి చ దర్శనాయ, సుదర్శనం హేతురభూన్మురారేః ॥ (చం.భా. 10-76)

కవిరాజు, అనంతభట్టు లోకములోఁ బ్రచారములో నున్న కథను గ్రహించినారు.

**అలంకారచర్చ :**

శ్లో॥ రత్నావతంస ఇవ భారతమండలస్య
క్రామన్ దిశో దశరథస్ఫుటవీరలక్ష్మీః ।
రాజా సుమంత్రవిహితాభిరతిర్బభూవ
పాండుర్యశోభిరభిరంజితసర్వలోకః ॥ (1-49)

దశరథః = దశరథుఁడు, యశోభిః పాండుః = కీర్తులచేఁ దెల్లనివాఁడు (రామా). పాండుః = పాండుమహారాజు, దశరథః = దశదిక్కులయందు రథములు గలవాఁడు. (భార). ఇక్కడ శ్లేషానుప్రాణితతుల్యయోగితాలంకారమని కొందఱు చెప్పుచున్నారు. చమత్కారాధాయకమగుటచే శ్లేషాలంకారమే చెప్పవలెను.

**శ్లో॥అభజత పరితూర్ణమ్ బద్ధపాదః పతంగః** (4-15)

పతంగః = సూర్యుఁడు; పక్షి. ఇక్కడ సూర్యవర్ణనముచేఁ బక్షి వర్ణనము కూడ స్ఫురించుచున్నది. పతంగశబ్దములో శ్లేష యుండుటచే సమాసోక్తి కాదు. పక్షి యను నర్థమప్రస్తుతమగుటే శ్లేష కాదు. ప్రకరణార్థము ననుసరించి యభిధచే సూర్యార్థము, వ్యంజనచేఁ బక్ష్యర్థము వచ్చుటచే నిక్కడ **శబ్దశక్తివలనఁ గలిగిన ధ్వనిని** జెప్పవలయును.

**శాస్త్రసమన్వయము :**

**శ్లో॥ స నః కరోతు విఘ్నానాం వారణం వారణాననః ।**
**మదరావిభిరారబ్ధభోగావళిరివాళిభిః ॥** (1-2)

ఏ వినాయకుని చెక్కిళ్ళపై నున్న మదజలమును ద్రాగుటకై వ్రాలిన తుమ్మెదల ఝంకారధ్వని భోగావళివలె నున్నదో యట్టి యేనుఁగు ముఖముగల దేవర మా విఘ్నములను నివారించుఁగాక!

ఇక్కడ 'భోగావళి = స్తుతిపాఠము' – అని ముందుగా నర్థము చెప్పి తరువాత భోగావళి యనఁగా గండస్థలశోభకై గీసిన చిత్రమని రెండవ యర్థము చెప్పి

శ్లో॥ గంధచందనసంయుక్తా రోచనాకుంకుమైర్యుతా ।
నామ్నా **భోగావళిః** ఖ్యాతా హ్యపూర్వా గండశోభినీ ॥

మంచిగంధముతోఁ గుంకుమతో బుగ్గలపై నద్దిన చిత్రము **భోగావళి** యని లక్షణము నుదాహరించినాఁడు.

**2. అకామం చకమే సా తం తరుణం జ్యాయసీ సతీ ' (4-8)**

వృద్ధయైన శూర్పణఖ యువకుఁడైన శ్రీరామునిఁ గామించినది. కాని 'ప్రాణహానికరీ వృద్ధా' పురుషునికంటె స్త్రీ పెద్దదియైనచో నాయుః క్షీణమని కామశాస్త్రము నుదాహరించినాఁడు.

**3. నిశాకరేణేవ నరేశ్వరేణ ప్రణీతభాస్వజ్జయమంగలక్ష్మీః । (10-43)**

చంద్రుని వంటి శ్రీరాముని (యుధిష్ఠిరుని) చేఁగూర్పఁబడిన జయముచే లక్ష్మణుఁడు (అర్జునుఁడు) ప్రకాశించెను. ఇక్కడ జన్మ - సప్తమాది స్థానములలో నున్న చంద్రుఁడు జయమంగళాదుల నిచ్చు ననుటకు -

శ్లో॥ సప్తాద్యచంద్రే ధ్రువమర్థలాభం, షష్ఠే తృతీయే ధనభోగమాయుః ।
సర్వార్థసిద్ధిం దశమే వదంతి, హ్యేకాదశే సర్వసుఖాని చైవ ॥

చంద్రుఁడు 1-7 స్థానములలో నున్న యర్థలాభమును, 3-6 స్థానములలో నున్న ధనము - భోగము, ఆయువు; 10లో నున్న సర్వార్థసిద్ధిని, 11లో నున్న సకలసుఖములను గూర్చునని **జ్యోతిషశాస్త్రము** నుదాహరించినాఁడు.

**4. అథ చ వచనబాణైర్మర్మభేదప్రవీణైః (12-23)**

లక్ష్మణేంద్రజిత్తులు, కర్ణార్జునులు మర్మములను నాటు మాటలు బాణములు వేయుచు యుద్ధము చేసిరి. ఒక్కడ దేహమునందలి మర్మస్థానముల (ఆయువుపట్టుల)ను దెలుపుటకై **వైద్యశాస్త్రము** నుదాహరించినాఁడు.

**5. స చంద్రలేఖశ్చలహంసపక్షతిస్సపద్మకోశశ్శుకతుండభాసురః ।
కరాంగహారస్సుదృశామశోభయత్తదా శరత్కాల ఇవ ప్రభోస్సభామ్ ॥ (13-58)**

ఇక్కడ వ్యాఖ్యానములో **నాట్యశాస్త్రము** ననుసరించి చంద్రకళ, హంసపక్షతి, పద్మకోశము, శుకతుండము మొదలు నభినయ హస్త విశేషములు వివరింపబడినవి.

**ఉదాహృతగ్రంథములు - గ్రంథకర్తలు**

ప్రేమచంద్రుడు బహుగ్రంథపరిశీలకుఁడు. వ్యాఖ్యానములో నుదాహరించిన గ్రంథముల, గ్రంథకర్తల పట్టిక నకారాది క్రమములో నిచ్చుచున్నాను.

అధ్యాత్మరామాయణము (1-59); అన్యే (1-23); అపరే (1-23); అభియుక్తాః (13-58); అమరః (1-1); కర్పూరః (1-18); కళింగః (1-18); కామదేవః (1-18); కామశాస్త్రమ్ (4-8); కోకిలః (1-18); కేచిత్ (1-2); కేషాంచిత్ (1-6); కేదారభట్టః (1-12)(3-42);

.జ్యోతిషమ్ (10-43); తారేంద్రః (1-18); త్రికాండశేషః (1-16); దండీ (1-45) (13-16); ద్వైపాయనః (1-9); నందికేశ్వరః (13-58); నాగానందమ్ (1-24); నైషధమ్ (10-27); పురుషోత్తమః (1-68) (2-3); పుష్పదంతః (1-25); పౌరాణికీ కథా (2-30); బాణః (1-18); భగవద్గీతా (13-12); భవభూతిః (1-2); భాగవతమ్ (5-28); భారవిః (4-2); భోజః (1-18); మదనః (1-18); మనుః (5-28) (11-6); ముమ్మటభట్టః (1-4); మయూరః (1-18); మహాభారతమ్ - (1-50); మురారిః (1-4); మేదినీ (1-1); రామాయణమ్ (1-20); వరరుచిః (1-18); వాల్మీకిః (1-57); విద్యావినోదః (1-18); వినాయకః (1-18); విశ్వః (1-30); విష్ణుపురాణమ్ (1-31); వేదాంతినః (5-10); వైద్యకమ్ (12-23); శంకరః (1-18); శబ్దార్ణవః (3-43); శ్రీధరస్వామీ (1-31); సాముద్రికమ్ (13-1); స్మరణాత్ (13-12); హారీతః (1-33); హేమచంద్రః (1-4); ఇత్యాదులు. నిఘంటువులలో నమర - మేదినీ - విశ్వ - హేమచంద్రకోశములు, అలంకారగ్రంథములలో సాహిత్యదర్పణము నెక్కువగా నుదాహరింపఁబడినవి.

ఈ విధముగాఁ బ్రేమచంద్రవ్యాఖ్య మొదటినుండి చివరిదాఁక నొకే రీతిలో సాగినది. ప్రేమచంద్రుఁడు రాఘపాండవీయదుర్గకవాటములు తెఱచినాఁడు. మనము ప్రవేశించుటయే యాలస్యము.

శ్రీశంకరప్రసాదభట్టాచార్య్య లీ రాఘవపాండవీయమునకుఁ గల లిఖితప్రతులు; సంస్కరణములను గూర్చి యిట్లు తెలియఁజేసినారు.

**లిఖితప్రతులు**

ఈ రాఘవపాండవీయమునకు దేశవిదేశములలో దేవనాగరీ - బెంగాలీ - తెలుఁగు లిపులలో ననేక లిఖిత ప్రతులు గలవు. మద్రాసు ప్రాచ్యలిఖితగ్రంథాలయములో నొక తెలుఁగు లిపి - తాళపత్ర ప్రతి గలదు. నేపాళదేశమునందలి దర్బారు గ్రంథాలయములో నొక తాళపత్రప్రతి గలదు. ఇంగ్లండుదేశమునందలి భారతీయగ్రంథాలయములో 3 తాళపత్రప్రతులు గలవు. వీనిలో నొక ప్రతి దేవనాగరలిపిలో క్రీ.శ. 1620లో వ్రాయఁబడినది. జర్మనీదేశమునందలి 'లీప్‌జిగ్' పట్టణములో రెండు లిఖిత ప్రతులు గలవు. ఒకటి రామచంద్రన్యాయాలంకార వ్యాఖ్యతోఁ గూడినది. రెండవది యజ్ఞాత కర్తృకమైన స్థూలతాత్పర్యార్థము గలది. కలకత్తా సంస్కృత కళాశాలలో 8 లిఖిత ప్రతులున్నవి. ఈ విధముగా 15 వ్రాఁత ప్రతులు లభించుచున్నవి.

**సంస్కరణములు**

1. కావ్యరత్నమాల - నాగరలిపి - బొంబాయి - **1889**
2. కావ్యమాల - నాగరలిపి - బొంబాయి - **1897**
3. ప్రేమచంద్రవ్యాఖ్య - బెంగాలీ లిపి - కలకత్తా - **1833,1905**
4. **ప్రేమచంద్రవ్యాఖ్య - తెలుఁగులిపి - మద్రాసు - 1892 (శ్రీనికేతనముద్రణాలయము);2021**
5. దామోదరఝూ వ్యాఖ్య - నాగరలిపి - ఛౌఖంభా, కాశీ - **1966,2014**

6. ప్రేమచంద్ర వ్యాఖ్య – బెంగాలీ లిపి – కలకత్తా – **1970**

ప్రస్తుతము శ్రీరామోరా గారి సంపాదకత్వములో వెలువడుచున్నది **9వ సంస్కరణము**. ప్రేమచంద్రవ్యాఖ్య 5వ సంస్కరణము.

దీని వలన నీ కావ్యమునకుఁ గల ప్రచురప్రచారము తెల్ల మగుచున్నది.

**దేవతానుగ్రహము**

ఈ సంవత్సరము శ్రావణమాసములో శ్రీరావి మోహనరావు గారు తాము రాఘవపాండవీయమును బ్రకటించుచున్నట్లు చెప్పి దానికిఁ బీఠిక వ్రాయవలయునని న న్నాదేశించిరి. శ్రీనడింపల్లి లక్ష్మీనారాయణగారు 11-8-2020 నాఁడు దీనికి ఛాయాప్రతిని దీసి నాకుఁ బంపినారు. 5-11-2020 గురువారము నాఁడు రాత్రి నాకు గుండెపోటుతో నాయాసము హెచ్చి విజయవాడ రమేశవైద్యశాలలోఁ జేరితిని. 9-11-2020 నాఁడు శస్త్రచికిత్స జరిగినది. 13-11-2020నాఁడు క్షేమముగా నింటికి వచ్చితిని. ఈ విధముగా గ్రంథములు రచించుటకై శ్రీశారదాదేవియే యనుగ్రహించినదని విశ్వసించుచున్నాను. శ్రీరావి కృష్ణకుమారీ – మోహనరావు దంపతులు నన్నుఁ జూచుటకై మా యింటికి వచ్చిరి. వారికిఁ బీఠిక వ్రాసి యిచ్చెదనని మాట యిచ్చితిని. ఇది యీ నాఁటికి నెఱవేరినది. నాకు మఱల నారోగ్యము చేకూరుటకు శ్రీమోహనరావుగారి సుహృద్భావము, వాత్సల్యము కారణములని భావించుచున్నాను. వైద్యశాలయందు, గృహమునందు నా యారోగ్యమునకు సహకరించిన నా **ధర్మపత్ని చి॥సౌ॥ నాగలక్ష్మికి**, మా **చిరంజీవి సూర్యతేజాకు** నా యాశీస్సులు.

**కృతజ్ఞతలు**

ఈ యవతారిక రచించుటలో 1. శ్రీమాడభూషి కృష్ణమాచార్యుల '**దేవవాణీ సాహిత్యచరితము**' (History of Classical Sanskrit Literature) 2. శ్రీబలదేవోపాధ్యాయుల '**సంస్కృతసాహిత్య కా ఇతిహాస్**' ; 3. శ్రీదామోదరఝా పండితుల హిందీ '**భూమిక**'; 4. కావ్యతీర్థ శ్రీశంకర ప్రసాదభట్టాచార్యులు M.A., D.Phil. బెంగాలీ లిపి ప్రతికి రచించిన **యాంగ్లభాషోపోద్ఘాతము** (Introduction to the Poem Raghava Pandaviyam) నాకెక్కువగా నుపకరించినవి. ఈ నలువురు పండితులకు నమస్కృతు లర్పించుచున్నాను.

1892లో ముద్రింపఁబడి శిథిలావస్థలో నున్న యీ గ్రంథమునకు ఛాయాప్రతిని దీసిన వారు శ్రీనడింపల్లి లక్ష్మీనారాయణగారు. ఈ గ్రంథ ముద్రణములో నచ్చు తప్పులను సవరించి శుద్ధప్రతిని గూర్చినవారు శ్రీ వుయ్యూరు లక్ష్మీనరసింహరావు గారు. వీ రిరువురకు నా కృతజ్ఞతాభినందనములు. రాఘవపాండవీయమునకు శుద్ధచ్ఛాయాప్రతిని (Scanning Copy) నిర్మించుటలో శ్రీలక్ష్మీనారాయణగారికిఁ దోడ్పడిన వారు వారి కుమారులు 1. భాస్వంతుఁడు (6వ తరగతి), 2. అభిజిత్తు (8వ తరగతి). ఈ చిరంజీవు లిద్దఱకు నా శుభాశీస్సులు.

బహువ్యయ ప్రయాసముల కోర్చి యీ గ్రంథమును బునః ప్రకటించి పాఠకుల కందించుచున్న ద్విశతాధిక గ్రంథ ప్రకాశకులు శ్రీరావి కృష్ణకుమారీ – మోహనరావు దంపతులను సకుటుంబముగా రక్షింపవలెనని శ్రీసరస్వతీమాతను బ్రార్థించుచున్నాను. ఈ గ్రంథమును గూర్చి యవతారిక రచించుటకు నా కాయురారోగ్యములు ప్రసాదించిన శ్రీపద్మావతీ వేంకటేశ్వర స్వామి పాదపద్మములకీ వైకుంఠైకాదశీ శుభపర్వము నాఁడు పునః పునః ప్రణామము లర్పించుచున్నాను. నీరక్షీరవివేకన్యాయమున నీ యవతారిక యందలి దోషసందోహమును బరిత్యజించి, గుణలేశమున్నచో గ్రహించి న న్ననుగ్రహింప వలెనని పండితహంసులను వేఁడు కొనుచు నింతటితో ముగించుచున్నాను.

శ్రీమత్పరమేశ్వరార్పణమస్తు.

విజయవాడ, ఇట్లు

శ్రీశార్వరీ మార్గశీర్ష శుద్ధైకాదశీ శుక్రవారము, సకలసుకవిబుధజనవిధేయుఁడు,

ముక్కోటి యేకాదశి - 25-12-2020. **గరిమెళ్ళ సోమయాజులు శర్మ.**



## శ్రీః

# పంచరత్నాలు

సీ॥ వేదాంతకృతు లెన్నొ విపులటీకలతోడ
ముద్రించి పంచితి బుధజనులకుఁ
గావ్యాలు కోశాలు కమనీయరీతిలో
వెలయించి యిచ్చితివి పఠితలకుఁ
దంత్రాలు మంత్రాలు తగినట్లు తీరిచి
పంచితివి కదా! యుపాసకులకు
సూత్రాలు స్తోత్రాలు సుందరాకృతు లొప్ప
నందించితివి సుజనాస్తికులకు

గీ॥ నొండు రెం డటిటుగ నహో! రెండు నూర్ల
పుస్తకమ్ములు ముద్రించి పుణ్యపురుష!
తెలుఁగుజాతికిన్ మోదమ్ము నిలిపినావు
రావి మోహనరాయ! సరస్వతిసుత!

ఉ. ఎన్ని యెకాడమీలు గల వీమనతెన్గుధరాతలమ్మునం
దన్నియు నేకమైన నవురా! యిటువంటివి గ్రంథరాసులన్
వన్నెకుఁ దెచ్చెనా మునుపు భారతి మెచ్చెడిరీతి నీవలెన్?
హృన్నయనామృతమ్ము సుమి! యీకృషి సంస్కృతవాఙ్మయప్రియా!

చ. రసికులు మెచ్చినారు కవిరాజుది రాఘవపాండవీయ మన్
పస గలద్వ్యర్థికావ్యమును వ్యాఖ్యను దాల్చినదాని నిష్ట నీ
వసదృశసుందరాకృతిని నందఱు మెచ్చెడిరీతి నిట్లు తె
చ్చి సుగుణశేఖరుండ వయి శేముషి భాసిలఁజేసినావు గా!

ఆ.వె. పంటపొలముమీఁదఁ బర్జన్యునట్టులు
గ్రంథరాశిమీఁదఁ గాసు లహహ!
కురిసినావు బుధులు మురిసినా రిలలోన
బుధజననుతచర్య! మోహనార్య!

తే.గీ. సకలదేవతాకృపవల్ల సకలగతుల
సారసాహిత్యవరివస్య సాఁగుచుండ
నాయురారోగ్యభాగ్యమ్ము లందుమయ్య!
రావి మోహనరాయ! సారస్వతీయ!

ది. 14.1.2020, గురువారము **– డా ॥ వుయ్యూరు లక్ష్మీనరసింహారావు**

శార్వరి సంక్రాంతి **గుంటూరు, ఫోను – 9573884352**



శ్రీకవిరాజవిరచితమైన శ్రీరాఘవపాండవీయమను సంస్కృతమహాకావ్యము ప్రథమంగా తెలుగులిపిలో శ్రీ ప్రేమచంద్రతర్కవాగీశభట్టాచార్యవిరచితమైన కవాటవిపాటికా సంస్కృతవ్యాఖ్యతో 1892న ముద్రితమైన ఈ గ్రంథరాజం నేడు మా దంపతులచే పునర్ముద్రణ గావింపబడుట మాకు అమితానందము కలిగిస్తున్నది.

నేడు పునర్ముద్రణకు నోచుకున్న ఈ గ్రంథరాజమునకు మరింత శోభను కలిగిస్తున్న విస్తృతపీఠికను అందించిన వారు గురుతుల్యులు, సన్మిత్రులు అగు బ్రహ్మశ్రీ గరిమెళ్ళ సోమయాజులు శర్మగార్కి నమస్సుమాంజలి.

అచ్చుతప్పులు చూచుటలో వెన్నంటియుండి, తోడ్పడిన డా॥ వుయ్యూరు లక్ష్మీనరసింహారావు గారికి ధన్యవాదములు.

అంతర్జాలప్రతిని అందించిన శ్రీలక్ష్మీనారాయణ గారికి శుభాశీస్సులు.

**శ్లో॥ వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే ।**
**జగతః పితరౌ వన్దే పార్వతీపరమేశ్వరౌ ॥**

భవదీయుడు

– **రామోరా**, సంపాదకుడు.

## శ్రీః

## మఙ్గళాచరణాది.

శ్లో॥ దధన్మరకతస్థలీద్యుతివిడమ్బికాన్తిచ్ఛటాం
పురః ప్రబలమారుతో నిహితజిష్ణుచాపోజ్జ్వలః ।
హరన్ సపది దుస్సహాం రవిజతాపభీతిం నృణాం
మదీయహృదయామ్బరే స్ఫురతు కోఽపి ధారాధరః ॥ **1**

శ్లో॥ ఆసీదసీమగరిమాస్పదకశ్యపర్షి
వంశప్రశంసితజనుర్మనుతోప్యనూనః ।
సర్వేశ్వరోఽనవరతక్రతుకర్మనిష్ఠా
నిర్వర్తితావసథిసంజ్ఞితయా ప్రతీతః ॥ **2**

శ్లో॥ తదన్వయసుధామ్బుధే రజని రామనారాయణః
శశీవ విమలాన్తరో ద్విజవరః శ్రియా భాసురః ।
యదీయగుణచన్ద్రికోల్లసితరాధనీరాశయే
సతాం హృదయకైరవం కలితగౌరవం మోదతే ॥ **3**

శ్లో॥ శ్రీప్రేమచన్ద్రేణ తదాత్మజేన కావ్యోత్తరే రాఘవపాణ్డవీయే ।
బాలావబోధాయ సతాం ముదే చ వితన్యతే సద్వివృతిః స్ఫుటార్థా ॥**4**

శ్లో॥ అర్థాన్ గ్రహీతుమిహ కావ్యపురే ప్రవిశ్య
యుష్మాకమస్తి యది చేతసి సత్యమిచ్ఛా ।
కాఠిన్యదుర్ధరకపాటవిపాటికాం మే
టీకాం తదా ప్రథమమేవ కరే కురుధ్వమ్ । **5**

శ్లో॥ అగర్వాః పూర్వేషామతిగహనవాణీచతురతా
ప్రకాశక్లేశజ్ఞా జగతి విజయన్తే కతిపయే ।
ఖలాస్తు స్వచ్ఛన్దం పరభణితిదోషానుసరణై-
రవజ్ఞాయాం విజ్ఞా విదధతి న కేషామపయశః ॥ **6**



# శ్రీరాఘవపాణ్డవీయమ్



శ్లో॥ కామం సన్త్విహ మాఘనైషధముఖాన్యేకాపదానాశ్రయాత్
కావ్యాని స్ఫుటమద్యతాని న పునస్తన్వంతి నః కౌతుకమ్ ।
శ్రీరామాయణభారతాఖ్యచరితద్వంద్వం దధన్నిస్తులై-
శ్శబ్దై రాఘవపాణ్డవీయ్యమమలం బధ్నాతి కౌతూహలమ్ ॥ **1**

శ్లో॥ దృష్ట్వైతత్కవిరాజకావ్యమతులం మాత్సర్యతః కేచన
వ్రీడానమ్రముఖాస్సహాసమధునా నిందంతు మందా జనాః ।
ఉన్నిర్యద్రసమాధురీపరవశైశ్చేతోభిరత్యాదర-
శ్లాఘాఘూర్ణితశేఖరస్రగలయో నందం త్వమందాః పరే ॥ **2**

– శ్రీ. తి. ఆ. తి. కుమారతాతార్యః ॥



శ్రీః

శ్రీ పరంబ్రహ్మణే నమః ।

# రాఘవపాణ్డవీయే

## ప్రథమః సర్గః ।

శ్లో॥ స్వాధిష్ఠానామ్బుజరజఃపుఞ్జపిఞ్జరమూర్తయే ।
ఇచ్ఛాధీనజగత్సృష్టికర్మణే బ్రహ్మణే నమః ॥ 1

అత్ర తావదభూతపూర్వకావ్యవర్ణనాజనితయశోరాశిప్రకాశితప్రకర్షతయా కవిసార్థ సార్థకీకృతనామా శ్రీకవిరాజనామా మహాకవిః ప్రకరణైక్యాదినా రాఘవపాణ్డవీయేతిహాస వర్ణనరూపం రాఘవపాణ్డవీయాభిధం మహాకావ్యమారభమాణస్తత్సమాప్తి ప్రతిబన్ధకీభూత- మాత్మనః ప్రత్యూహవ్యూహమాశఙ్క్య తద్విఘాతాయ కృతమపి నానాదేవతోపాసనరూపం మఙ్గళం శిష్యశిక్షార్థముపనిబధ్నన్ సురజ్యేష్ఠత్వాత్ప్రథమం బ్రహ్మాణముపశ్లోకయతి స్వాధిష్ఠానేతి. బ్రహ్మణే పరమేష్ఠినే నమః. కిం భూతాయ స్వస్యాధిష్ఠానమ్ ఆసనభూతం యదమ్బుజం పద్మం తస్య రజసాం పరాగాణాం పుఞ్జైస్సమూహైః పిఞ్జరా పీతవర్ణా మూర్తిః శరీరం యస్య స తథా తస్మై; స్వభావతో రక్తవర్ణాపి బ్రహ్మణో మూర్తిర్నిజాసన- కమలపరాగైః పీతవర్ణా జాతేత్యర్థః. ఏతేన తదమ్బుజస్య పరాగాధిక్యాదితరామ్బుజాపేక్షయా వైలక్షణ్యం బ్రహ్మణశ్చ నియతతదమ్బుజావస్థాయిత్వం ధ్వనితమ్. పునః కిమ్భూతాయ ఇచ్ఛాయా నిజాభిలాషమాత్రస్య న తు కులాలాదేరివ కాయికక్లేశస్య అధీనమ్ ఆయత్తం జగతో విశ్వస్య సృష్టికర్మనిర్మాణకార్యం యస్య స తథా తస్మై; ఏతేన బ్రహ్మా స్వేచ్ఛయా జగన్నిర్మిమీతే; ఉత్పత్స్యమానమేతత్కావ్యమపి జగదన్తర్గతం భవిష్యతి తస్మాదేతస్మిన్నపి కిఞ్చిదిచ్ఛాం విదధాత్వితి కవేరభిలాషో ధ్వనితః. అథవా బ్రహ్మణే పరమాత్మనే నమః. కిం భూతాయ స్వమేవాధిష్ఠానం యస్యాస్తాదృశీ మాయా సైవామ్బుజం మధువద్వైషయిక- సుఖాస్పదత్వాత్పద్మం తస్య రజఃపుఞ్జేన రజోగుణాధిక్యేన అథ చ పరాగసమూహేన పిఞ్జరారక్తా మూర్తిః స్వరూపం యస్య తత్ తథా తస్మై; రజసా రక్తవర్ణత్వమాగమేషు ప్రసిద్ధమ్. అత ఏవ **బహు స్యాం ప్రజాయేయ** ఇత్యాది రూపా యా ఇచ్ఛాయా అధీనం జగతః ప్రపఞ్చస్య సృష్టికర్మ యస్య తాదృశాయ స్వతో గుణక్రియాశూన్యా యాపి మాయా సమ్బన్ధాత్తదుభయవత ఇత్యర్థః. పిఞ్జరమూర్తయే ఇత్యత్ర తద్గుణాలఙ్కారః. స్వముత్సృజ్య గుణం యోగాదత్యుజ్జ్వల- గుణస్య యత్ । వస్తుతద్గుణతామేతి భణ్యతే స తు తద్గుణ ఇతి లక్షణాత్. పిఞ్జరో శ్వాన్తరే క్లీబే స్వర్ణే పీతే చ వాచ్యవదితి మేదినీ. పిఞ్జరమూర్తి బ్రహ్మా శ్రీరామచన్ద్రః. వేదస్తత్త్వం తపోబ్రహ్మబ్రహ్మా విప్రః ప్రజాపతిరిత్యమరః. 1

**శ్లో॥ పునాతు వస్సరస్వత్యా విలాసశిశుకశ్శుకః ।**
**తలాంశుమయమాణిక్యపఞ్జరాన్తరగోచరః ॥ 2**

నమస్కారరూపమ్మఙ్గళముక్త్వా ఆశీర్వాదరూపం మఙ్గళం కుర్వన్ వాఙ్మయాధిష్ఠాత్రీం సరస్వతీముపశ్లోకయన్ ప్రార్థయతే, పునాత్వితి. సరస్వత్యా వాగ్దేవతాయా విలాసస్య క్రీడాయా విలాసాయ వా శిశుకః కృత్రిమపుత్త్రకరూపః శుకః కీరః వో యుష్మాన్ పునాతు పవిత్రీ కరోతు. యుష్మాకం కావ్యకృతిజ్ఞప్తిప్రతికూలం దుష్కృతవిశేషముపశమయత్విత్యర్థః. పక్షివిశేషస్య శుకస్య పవిత్రకారిత్వాభావేఽప్యుపాస్యదేవతాభ్యోఽభీష్టశంసనాపేక్షయా తద్గుణ-క్రియాపరివారాదితస్తథా శంసనమధికతరం వైదగ్ధ్యం ద్యోతయతీతి కవిసమ్ప్రదాయః. అత ఏవ వైనాయక్యశ్చిరం వో వదనవిధుతయః పాన్తు చీత్కారవత్యః ఇత్యాదయో మహాకవి ప్రయోగాః. వినా పక్షిణా లాసః క్రీడా విలాసస్తత్ర శిశుక ఇత్యపరే. కిమ్భూతః తలస్య సరస్వత్యాః కరతలస్య యేఽంశవో లోహితకిరణాస్తన్మయం తద్రూపం యన్మాణిక్యపఞ్జరం శోణమణినిర్మితం పక్షిరక్షణయన్త్రం తస్య అన్తరం మధ్యం తస్య గోచరో విషయస్తన్మధ్య-వర్తీత్యర్థః. అన్యాపి క్రీడనశీలా పుత్త్రకోఽయమితి మత్వా శుకేన క్రీడతి శుకశ్చ మాణిక్యపఞ్జరే తిష్ఠతి; శుకహస్తా కాచిత్ సరస్వతీమూర్తిర్వా ఆగమవిశేషే స్యాత్. భారతవక్తారం శుకదేవం స్తౌతీత్యాభాష్య శుకః శుకదేవ ఇత్యాది కేషాంచిద్వ్యాఖ్యానమశ్రద్ధేయం శుకదేవస్య భారత-వక్తృత్వాభావాత్, వైశమ్పాయనస్యైవ తథాత్వాత్. ఉత్తరార్ధే తలాంశూనామపహ్నవేన మాణిక్యపఞ్జరస్థాపనాద**పహ్నుత్యలఙ్కారః**. ప్రకృతం యన్నిషిధ్యాన్యత్సాధ్యతే సా **త్వపహ్నుతిః** ఇతి లక్షణాత్. తారామయాస్తత్ర చ ఫేనభఙ్గా ఇత్యాది సాహిత్యదర్పణీయోదాహరణదర్శనాచ్చ.

**శ్లో॥ బ్రహ్మాణ్డమణ్డలచ్ఛద్మపద్మకుట్మలదీర్ఘికా ।**
**జాయతాం జగతశ్శాన్త్యై శామ్భవీ శక్తిరేకికా ॥ 3**

జలమయీం శివస్య మూర్తిముపశ్లోకయన్ ప్రార్థయతే, బ్రహ్మాణ్డేతి. ఏకికా అద్వితీయా శామ్భవీ శివసమ్బన్ధినీ శక్తిః శివస్య జలమయీమూర్తిరిత్యర్థః. జగతో లోకస్య శాన్త్యై రక్షణాయ సుఖాయ వా జాయతాం భవతు. శామ్భవీశక్తిరేవ ఉపద్రవేభ్యో లోకాన్ రక్షత్విత్యర్థః. కిమ్భూతా బ్రహ్మాణ్డమణ్డలమేవ ఛద్మ ఛలం యస్య తాదృశం యత్పద్మం తస్య యః కుట్మలోఽ ఙ్కురీభావేన ప్రథమోత్పత్తిరిత్యర్థః. తస్య దీర్ఘికా వాపీ జల ఏవ బ్రహ్మాణ్డస్య ప్రథమావిర్భావాత్; తథా చ **మనుః** ఆప ఏవ ససర్జాదౌ తాసు వీర్యమపాసృజత్। తదణ్డమభవద్ధైమం సహస్రాంశు సమప్రభమితి. అన్యోపి కుట్మలో దీర్ఘికాయాం జాయతే, బ్రహ్మాణ్డసన్నివేశోపి కమలాకారతయా పురాణాదౌ వర్ణితః. అత్ర ప్రకృతస్య బ్రహ్మాణ్డమణ్డలస్యాపహ్నవేనాప్రకృతపద్మకుట్మల-స్థాపనాద**పహ్నుత్యలఙ్కారః**. ఉత్తరార్ధే తు తన్మూలతశ్చ శక్తౌ దీర్ఘికారోపా**ద్రూపకాలఙ్కారశ్చ**. తద్రూపకమభేదో య ఉపమానోపమేయయోరితి లక్షణాత్. ఏవం చాత్ర ద్వయోరఙ్గాఙ్గి-భావస్స**ఙ్కరః**. బ్రహ్మాణ్డమణ్డలాశేషేతి పాఠే **శుద్ధరూపకమేవ**.

**శ్లో॥ శ్రీలతాలిఙ్గితాఙ్గస్య విష్ణుకల్పద్రుమస్య వః ।**
**అవతారమహాశాఖాః ఫలన్తు ఫలమీప్సితమ్ ॥ 4**

అభీష్టఫలదాతృతయా సలక్ష్మీకం నారాయణముపశ్లోకయన్ ప్రార్థయతే, శ్రీలతేతి. విష్ణుర్నారాయణరూపో యః కల్పద్రుమస్తస్య యేఽవతారా మత్స్యకూర్మాదయస్త ఏవ మహాశాఖాః ప్రధానవృక్షాఙ్గవిశేషాస్తా వో యుష్మాకమీప్సితమభిలషితం యత్ఫలం వర్గచతుష్ట-యాన్యతమరూపముద్దేశ్యం తదేవ ఫలం శస్యం తత్ ఫలన్తు నిష్పాదయన్తు దదత్విత్యర్థః. కిం భూతస్య శ్రీర్లక్ష్మీస్తద్రూపాయా లతావల్లీతయాలిఙ్గితం వేష్టితమ్ అథ చ పరిరబ్ధమఙ్గం యస్య స తథా తస్య. అన్యోపి కల్పవృక్షో లతాలిఙ్గితో భవతి; తస్య శాఖాశ్చ యాచకేభ్యోఽ-భీష్టం దదతి; నిష్పత్త్యర్థకస్య ఫలధాతోరకర్మకత్వేపి అన్తర్భావిణ్యర్థత్వాత్క్వచిత్సకర్మకత్వమ్. తథా చ **మురారిః** వాల్మీకిః ఫలతి స్మ యస్య చరితం స్తోత్రాయ దివ్యాగిర ఇతి. అత్ర సాఙ్గస్యాఙ్గినో రూపణాత్ **సాఙ్గరూపకం**; అఙ్గినో యది సాఙ్గస్య రూపణం సాఙ్గమేవ తదితి లక్షణాత్. ఫలశబ్దశ్లేషోప్యత్ర సాఙ్గరూపకేఽధికమేవ వైచిత్ర్యమావహతి. దృశ్యన్తే క్వచిదారోప్యాః శ్లిష్టాస్సాఙ్గేపి రూపకే ఇత్యుక్తత్వాత్. శాఖా వేదవిభాగేపి పాదపాఙ్గే భుజేపి చేతి **విశ్వః**. ఫలం హేతుఫలే, జాతీఫలే. ఫలకశస్యయోరితి **హేమచన్ద్రః**. 4

**శ్లో॥ కాన్తిః శ్రీకణ్ఠకణ్ఠస్య జయత్యాలిఙ్గనోత్సుకా ।**
**స్కన్ధారూఢేవ కాళిన్దీ మౌళిమన్దాకినీర్ష్యయా ॥ 5**

పునరపి సర్వజ్ఞానప్రదం శివముపశ్లోకయతి కాన్తిరితి. శ్రీకణ్ఠస్య శివస్య కణ్ఠో గళస్య కాన్తిర్నీలాఛవిర్జయతి సర్వోత్కృష్టతయా వర్తతామ్. అత్రోత్ప్రేక్షతే మౌళౌ మస్తకే స్థితా మన్దాకినీ స్వర్గఙ్గా మౌళిమన్దాకినీ శాకపార్థివాదిత్వాన్మధ్యమపదలోపీ సమాసః, తస్యా ఈర్ష్యయా మన్దాకిన్యా హరశిరోఽవస్థానరూపస్య సౌభాగ్యస్యాక్షాన్త్యా ఇత్యర్థః. ఆలిఙ్గనోత్సుకా శివస్య కణ్ఠగ్రహపూర్వకపరిరమ్భణాయోద్యతా అత ఏవ స్కన్ధారూఢా శివస్యాంససమీపమాగతా కాళిన్దీవయమునేవ; నేయం భగవతః కణ్ఠే విషపానజనితా శ్యామా కాన్తిః కిన్తు నద్యో-రావయోర్మధ్యే త్వమేకా హరశిరోఽవస్థానసౌభాగ్యం లభసే నాహం కిమపి, అతస్తవ సౌభాగ్యాదధికం కణ్ఠగ్రహపూర్వకాలిఙ్గనసౌభాగ్యమనుభవామీతి మనసి కృత్వా తదర్థం శివకణ్ఠమారూఢా యమునేవేతి కాళిన్దీరూపద్రవ్యసంభావనాద్ద్రవ్యోత్ప్రేక్షేయం, సమ్భావన-మథోత్ప్రేక్షా ప్రకృతస్య సమేన యత్ ఇతి లక్షణాత్. కణ్ఠో దేశభిద్యుగ్రే ఇతి **మేదినీ**. 5

**శ్లో॥ స నః కరోతు విఘ్నానాం వారణం వారణాననః ।**
**మదరావిభిరారబ్ధభోగావళిరివాళిభిః ॥ 6**

విఘ్నాపహర్తారం గణేశముపశ్లోకయన్ ప్రార్థయతే, స ఇతి. సః విఘ్నవినాశకతయా ప్రసిద్ధో వారణాననో గజాననః నోఽస్మాకం విఘ్నానాం కావ్యకృతిప్రతిబన్ధకీభూత-దురదృష్టానాం వారణం నివారణం కరోతు విఘ్నాన్ నాశయత్విత్యర్థః. ఉత్ప్రేక్షయా విశినష్టి

మదేతి. భోగస్య సుఖస్యావళిః శ్రేణీ యతః సా భోగావళిః స్తుతిః మదేన మత్తతయా మదజలపానాభిలాషేణ వా రవితుం గుఞ్జితుం శీలం యేషాం తాదృశైరళిభిర్భ్రమరైః కర్తృభిః ఆరబ్ధా ప్రస్తుతా భోగావళిః స్తుతిపాఠో యస్య స తథా తాదృశ ఇతి. అత్ర భ్రమరాణాం గుఞ్జితే స్తుతిపాఠస్యోత్ప్రేక్షణాదుత్ప్రేక్షేయమ్. న ఇత్యత్ర వ ఇతి పాఠే వో యుష్మాకమిత్యర్థః. మదరావిభిరిత్యత్ర మదవారిభిరితి ఆరబ్ధేత్యత్ర ఆబద్ధేతి చ పాఠే మదవారిభిర్మదజలైర్హేతుభిరిత–స్తతః శ్రేణీరూపేణోపవిష్టైర్భ్రమరైరాబద్ధాకృతాభోగావళిః సర్పశరీరశ్రేణీ యత్ర స ఇవ ఇత్యన్వయః. వరవలసఞ్చలనే ఇత్యస్య రూపేణ మదవారిభిర్మదచపలైరితి వా. భోగస్సుఖే ధనే చాహేః శరీరఫణయోరపీతి **మేదినీ**. ఆళిభిరళివచ్ఛ్యామైర్మదవారిభిర్మదజలైరాబద్ధా–భోగావళిః గణ్డస్థచిత్రం యస్య స ఇవ శోభార్థం గణ్డచిత్రం యస్య స ఇవ శోభార్థం గణ్డస్థచిత్రం భోగావళిరుచ్యతే; గన్ధచన్దనసంయుక్తారోచనాకుఙ్కుమైర్యుతా । నామ్నా భోగావళిః ఖ్యాతా హ్యపూర్వాగణ్డశోభినీత్యుక్తేరితి కేచిత్. 6

**శ్లో॥ జగత్ప్రదీపయోర్వంశౌ సూర్యాచన్ద్రమసోరపి ।**
**యయోరుద్దీపితౌ వాగ్భిస్తౌ వందే కవిపుఙ్గవౌ ॥ 7**

అథ రామాయణభారతసమ్పాదకౌ వాల్మీకివ్యాసావుపశ్లోకయితుముపక్రమతే, జగదితి. అపిర్భిన్నక్రమే. జగత్ప్రదీపయోరపి జగతాం ప్రకాశకయోరపి సూర్యాచన్ద్రమసోర్వంశౌ అన్వవాయౌ యయోర్వాగ్భిర్వచనైః రామాయణమహాభారతరూపైరుద్దీపితౌ ప్రకాశితౌ, తౌ కవిపుఙ్గవౌ కవిశ్రేష్ఠౌ వాల్మీకివ్యాసౌ అహం వన్దే నమామి; యేన సూర్యోత్పన్నో రాఘవవంశో వర్ణితః, తావహం వన్దే ఇత్యర్థః. అత్ర జగత్ప్రదీపయోరపి వంశావన్యాభ్యాముద్దీపితావితి **విరోధాభాసః**; ఉద్దీపితౌ వర్ణితావితి విరోధభఙ్గశ్చ; ఏతేన వాల్మీకివ్యాసయోరితి మహత్త్వం ధ్వనితమ్. 7

**శ్లో॥ అన్యో విధాతా వాల్మీకిరాదికావ్యం కమణ్డలుః ।**
**రఘునాథకథా గఙ్గా తయా పూతా జగత్త్రయీ ॥ 8**

అన్య ఇతి. వాల్మీకిర్మునిరన్యోఽపరో విధాతా విలక్షణకావ్యసృష్టికరణాద్బ్రహ్మా; తథా ఆదికావ్యం తత్కృతం రామాయణమ్ అన్యః కమణ్డలుః జలాధారవిశేషః తథా తద్వర్తినీ రఘునాథస్య శ్రీరామచన్ద్రస్య కథామాహాత్మ్యోక్తిరగాయత తయా కథారూపయా గఙ్గయా జగత్త్రయీ భువనత్రయం పూతా పవిత్రీకృతా; అన్యస్యాపి బ్రహ్మణః కమణ్డలువిలాసినీ గఙ్గా జగత్త్రయం పునీతే; అత్ర వాల్మీక్యాదౌ బ్రహ్మాద్యధ్యవసానాత్ అయం రాజా అపరః పాకశాసన ఇత్యాదివదన్యేతి విశేషణయోగా**చ్చాతిశయోక్త్యలఙ్కారః**. సిద్ధత్వేఽధ్యవసాయ–స్యాతిశయోక్తిర్నిగద్యత ఇతి లక్షణాత్. అన్యేతి యథాయథం లిఙ్గవ్యత్యయేన సర్వత్ర యోజనీయమ్. 8

**శ్లో॥ ద్వైపాయనోఽపరో బ్రహ్మా తత్సృష్టిర్భారతార్ణవః ।**
**సూక్తయో దివ్యరత్నాని త్రైలోక్యం తైరలఙ్కృతమ్ ॥ 9**

ద్వైపాయన ఇతి. ద్వైపాయనో వ్యాసోపి అపరో బ్రహ్మా ప్రజాపతిరేవ; తథా భారతమేవార్ణవః సముద్రః స తస్య ద్వైపాయనబ్రహ్మణః సృష్టిః సర్గః, తన్నిర్మితం భారతమప్యపరస్సముద్ర ఇత్యర్థః. తత్ర చ సూక్తయః శోభనవచనాని దివ్యరత్నాని మనోజ్ఞహీరకాదిరత్నాని తైర్దివ్య-రత్నైస్త్రైలోక్యం లోకత్రయమ్ అలఙ్కృతం భూషితం, శ్రూయమాణైర్భారతవచనైరేవ కర్తవ్యా-కర్తవ్యవిధానావిధానాదినా సన్మార్గావస్థాపనాల్లోకాశ్శోభితా ఇత్యర్థః. అత్రాపి పూర్వోక్త ఏవాలఙ్కారః. 9

**శ్లో॥ నిఃశ్రేణ్యౌ బ్రహ్మలోకస్య వాగ్దేవ్యాః కర్ణకుణ్డలే ।**
**ధర్మద్రుమమహామూలే వాల్మీకివ్యాసయోః కృతీ ॥ 10**

స్వవిధేయగ్రన్థస్య మూలభూతే రామాయణభారతే స్తౌతి నిఃశ్రేణ్యావితి. వాల్మీకివ్యాసయోః కృతీ రామాయణభారతరూపే నిర్మితీ బ్రహ్మలోకస్య నిశ్శ్రేణ్యౌ సోపానరూపే బ్రహ్మలోకప్రాపికే ఇత్యర్థః; తథా తే వాగ్దేవ్యాః సరస్వత్యాః కర్ణకుణ్డలే కర్ణభూషణస్వరూపే అత్యుత్కృష్టతయా వాఙ్మయానాం శోభాజనికే ఇత్యర్థః; తథా ధర్మద్రుమస్య ధర్మరూపవృక్షస్య మహామూలే ప్రధానమూలస్వరూపే అతితరాం ధర్మోత్పాదికే ఇత్యర్థః; ఏతేన రామాయణభారతాను-యాయితయా మదీయోపి గ్రన్థస్తద్వదాదరణీయ ఇతి భావః. ధర్మద్రుమేత్యత్ర ధర్మే ద్రుమత్వారోపస్య భారతరామాయణయోర్మూలత్వారోపం ప్రతి నిమిత్తత్వాత్ **పరమ్పరిత-రూపకమ్**. అన్యత్ర తు **నిరఙ్గమాలారూపకమ్**. నిఃశ్రేణిస్త్వధిరోహిణీ ఇత్యమరః. 10

**శ్లో॥ భారతాదిపురాణాని శ్రీరామచరితాని చ ।**
**త్రిసన్ధ్యసవనాన్యేష సర్వసాధారణో మఖః ॥ 11**

భారతాదీతి. త్రిసన్ధ్యే ప్రాతర్మధ్యాహ్నసాయాహ్నరూపసన్ధ్యాత్రయే సవనాని స్నానాని త్రిసన్ధ్యస్నానజన్యఫలసమఫలజనకానీత్యర్థః. భారతాది పురాణాని ద్వైపాయనప్రణీతాని తథా శ్రీరామచరితాని వాల్మీక్యాదిప్రణీతాని రామాయణాని చ త్రిసంధ్యసవనానాం సాధారణో మఖో యజ్ఞః అశ్వమేధాదియాగా యథా స్వర్గాదికం సాధయన్తి ఏతాన్యపి తథేత్యర్థః. తత్తద్యాగే తు న సర్వేషాం వర్ణానామధికారః, భారతాదిరూపయాగస్తు సర్వవర్ణసాధారణః నిర్వివాదా**చ్ఛూద్రాణా**మప్యన్తతః శ్రవణేఽధికారస్మరణాత్. ఉక్తం చ పురాణమధికృత్య శ్రోతవ్యమిహ **శూద్రేణ** నాధ్యేతవ్యం కదాచనేతి. అత్ర భారతాదౌ మఖత్వారోపా-**ద్రూపకాలఙ్కారః**. భారతాదయ ఇతిహాసాః పురాణాని వైష్ణవాదీని చేతీతరేతరద్వన్ద్వః. కిం వా భారతాది ప్రధానభూతం యేషాం తాదృశాని పురాణానీతి కర్మధారయః. ఇతరపురాణాది శాస్త్రాపేక్షయా భారతస్య ప్రధానత్వం విద్యత ఏవ; తథాచోక్తం సంక్షిప్యసర్వశాస్త్రార్థం

భారతార్థానుసారతః । నిర్ణయః సర్వశాస్త్రాణాం భారతం పరికీర్తితమ్ ఇతి. భారతం సర్వవేదాశ్చ తులామారోపితాః పురా। దేవైర్బ్రహ్మాదిభిః సర్వై ఋషిభిశ్చ సమన్వితైః । వ్యాసస్యైవాజ్ఞయా తత్ర త్వత్యరిచ్యత భారతమ్ । మహత్త్వాద్భారవత్త్వాచ్చ మహాభారతముచ్యతే ఇతి చ. ఏష ఇత్యత్ర విధేయాపేక్షయా పుంస్త్వమేకత్వం చ. ప్రాహ్ణాపరాహ్ణమధ్యాహ్నా- స్త్రిసన్ధ్యమితి. సప్తతన్తుర్మఖః క్రతురితి **చామరః**. సవనం త్వధ్వరే స్నానే సోమనిర్దలనేపి చేతి **మేదినీ**. ఏష్వనుష్టుబ్వృత్తమ్. 11

**శ్లో॥ పురాణరామాయణభారతాదిక్షీరాణి సంయోజితభక్తివత్సైః ।**
**పురాతనైర్యా దుదుహే కవీన్ద్రైః సా భారతీ కామదుఘా మమాస్తు ॥12**

ఇదానీముపశ్లోకితాన్ స్వాభిలాషం ప్రార్థయతే, పురాణేతి. పురాతనైః ప్రాచీనైః కవీన్ద్రై- ర్వాల్మీక్యాదిభిర్మహాకవిభిః సంయోజితో భక్తిరూపో వత్సో యైస్తాదృశైః సద్భిః సంయోజితా భక్తిరూపా యే వత్సా స్తైః కరణైరితి వా; యాభారతీ పురాణరామాయణభారతాదిరూపాణి క్షీరాణి దుగ్ధాని దుదుహే దుగ్ధా, సా భారతీ వాణీ మమ కామదుఘా అభిలషితప్రపూరికా అస్తు భవతు; మయాపి సా భారతీ స్వాభిలషితైతత్కావ్యం క్షీరం దోహనీయా భవత్విత్యర్థః. అత్ర పురాణాదౌ క్షీరారోపస్య భక్తౌ చ వత్సత్వారోపస్య శాబ్దత్వాద్ భారత్యాం ధేనుత్వారోపోఽ ర్థాదవగన్తవ్యః, తస్మాదేకదేశవివర్తిరూపకమలఙ్కారః. కేషాం చిన్మతే **సమాసోక్త్యలఙ్కారః**. అన్యాపి ధేనుర్వత్ససంయోగాత్ క్షీరాణి దుహ్యతే, కామధేనుశ్చ సేవ్యమానా కామాన్ పూరయతి. దుదుహే ఇతి కర్మణి లిట్ యేత్యత్ర గౌణం కర్మ దుహాదేరిత్యనేనోక్తత్వాత్ ప్రథమా. అత్రోపేన్ద్రవజ్రేన్ద్రవజ్రయోరు**పజాతివృత్తం**. ఉపేన్ద్రవజ్రా జతజాస్తతో గౌ, స్యాదిన్ద్రవజ్రా తతజాస్తతో గౌ, అనన్తరోదీరితలక్ష్మభాజౌ పాదౌ యదీయావుపజాతయస్తా ఇతి **కేదారభట్టః**. 12

**శ్లో॥ అస్తి కాదంబసన్తానసన్తానకనవాఙ్కురః ।**
**కామదేవః క్షమాదేవకామధేనుర్జనేశ్వరః ॥ 13**

సత్ప్రవృత్యైతత్కావ్యనిర్మాణాయ దత్తప్రోత్సాహం కామదేవపతిం **చతుర్వింశతభిః శ్లోకైః** కవిర్వర్ణయతి, అస్తీతి. కామదేవః కామదేవనామా జనేశ్వరో రాజా అస్తి వర్తతే; కిం భూతః కాదమ్బసన్తానః కాదమ్బవంశ ఏవ సన్తానకో దేవతరుభేదస్తస్య నవాఙ్కురః నవోత్థితోద్భిద్రూపః తథా క్షమా దేవానాం బ్రాహ్మణానాం కామధేనుః కామపూరక ఇత్యర్థః. విశేషణద్వయేన కామదేవస్యాతివదాన్యత్వం సూచితమ్, అస్తీతి వర్తమానప్రయోగస్తదానీం తస్య వర్తమానత్వ- సూచకః **నిరఙ్గమాలారూపకమలఙ్కారోఽయం**; సన్తానః సన్తతౌ గోత్రే స్యాదపత్యే సురద్రుమే ఇతి **మేదినీ**. 13

**శ్లో॥ కామః పురాతనో యేన నూతనేనాభిభూయతే ।**
**భార్గవో రాఘవేణేవ రామో రామేణ సజ్గరే ॥ 14**

హస్తినం మత్వా నిశ్చిత్య మార్గణలక్ష్యభూతం శరవ్యం చకార, కుంభపూరణశబ్దం శ్రుత్వా గజోఽయం స శబ్దం జలం పిబతీతి మత్వా శబ్దబేధినా బాణేన విర్యాధేత్యర్థః, తథా **చాధ్యాత్మరామాయణం** "తత్రార్ధరాత్రసమయే మునిః కశ్చిత్తృషార్దితః । పిపాసార్దితయోః పిత్రోర్జలమానేతుముద్యతః । ఆపూరయజ్జలే కుంభం తదా శబ్దోఽభవన్మహాన్ గజః పిబతి పానీయమితి మత్వా మహానిశి । బాణం ధనుషి సంధాయ శబ్దభేదినమాక్షిపమ్" ఇతి. మృగః పశావస్త్రభేదే తురంగే చ మతంగజే । ఇతి **విశ్వః**. అస్మిన్పక్షే తమసోపకంఠే ఇత్యత్ర తమసా యా నదీ విశేషస్య ఉపకంఠే సమీపే ఇతి కేషాంచిద్వ్యాఖ్యానం చింత్యం, సరయూ-మన్వగాం నదీమితి వాల్మీక్యుక్తేః సరయూతీర ఏవ తథా వర్ణనస్యౌచిత్యాత్సరయూతమసయోశ్చ వస్తుతో భేదాత్. పక్షే తమసా మోహేన గాఢబుద్ధి రాక్రాంతమతిః అత ఏవ గతభీ-ర్నిషిద్ధోఽపి కామాసక్తపశుమారణే నిర్భయః సపాండుః ఉపకంఠే వివర్తమానం తిష్ఠంతమ్ అభీకం మృగరూపిణ్యాం స్త్రియాం మృగరూపం ధృత్వా కామాసక్తమ్ అనగ్రజన్మానం నాస్తి అగ్రజన్మా బ్రాహ్మణో యస్మాత్తాదృశం బ్రాహ్మణశ్రేష్ఠమిత్యర్థః, ఋషిం తపస్వితనయం మృగం హరిణం మత్వా మార్గణలక్ష్యభూతం చకార మృగరూపేణ రమమాణం కంచిన్మునితనయం బాణేన విర్యాధేత్యర్థః. తథా చ **మహాభారతం** "రాజా పాండుర్మహారణ్యే మృగవ్యాళనిషేవితే। చరన్ మైథునధర్మస్థం దదర్శ మృగయూథపం । తతస్తాం చ మృగీం తం చ రుక్మపుంఖైః-స్సుపత్రిభిః । నిర్బిభేదశరైస్తీక్ష్ణైః పాండుః పంచభిరాశుగైః । స చ రాజన్మహా తేజా ఋషిపుత్ర-స్తపోధనః । భార్యయా సహ తేజస్వీ మృగరూపేణ సంగతః । సంసక్తశ్చ తయా మృగ్యా మానుషీమీరయన్గిరం । క్షణేన పతితో భూమౌ విలలాపాకులేంద్రియః॥ ఇతి. అభీకః కాముకే క్రూరే నిర్భయే త్రిషు నా కవౌ ఇతి **మేదినీ**. 59

**శ్లో॥ తపస్వినశ్ఛన్నతనోశ్శరేణ విభిన్నమూర్తేర్జనకాన్మహాధేః ।**
**శాపం సుతాపాయనిబద్ధమృత్యుం ప్రియానువృత్తౌ కుశలోఽప్యవాప ॥60**

తపస్విన ఇతి. ప్రియా హృద్యా యా అనువృత్తిరనునయః తత్ర కుశలోపి నిపుణోపి అపరాధమార్జనాయ అతితరామనునయం కుర్వన్నపీత్యర్థః, దశరథః శరేణ బాణేన విభిన్నా విదారితా మూర్తిస్తనుః యస్య తాదృశస్య తపస్వినస్తాపసస్య తస్య జనకాత్పితురంధమునే-స్సకాశాత్ శాపమ్ అవాప ప్రాప్తవాన్; శాపం కీదృశం సుతాపాయనిబద్ధమృత్యుం సుతస్య పుత్త్రస్య అపాయేన విశ్లేషేణ నిబద్ధో నియతో మృత్యుర్యత్ర తాదృశం; త్వమపి సుతవియోగేన అహమివ నియతం మృత్యుం ప్రాప్స్యసీత్యేవం రూపమిత్యర్థః. జనకాత్కిం భూతాత్ ఛన్నతనోః రహః స్థితమూర్తేః తథా మహాధేః పుత్త్రమరణశ్రవణాత్ మహాన్ ఆధిః మానసవ్యథా యస్య తాదృశాత్; అయమర్థః శరవిభిన్నమూర్తిం తపస్వినం పరిత్యజ్య తదుక్త్యా తత్పితరమ్ అంధ-మునిముపగమ్య పిపాసుం తం జలేన సంతర్ప్య తావత్ స్వదుశ్చరితముక్తవాన్, తచ్ఛ్రుత్వాతి-దుఃఖాన్మమూర్ఛుః అంధమునిస్త్వమపి సుతవిశ్లేషదుఃఖేన మరిష్యసీతి శాపం దశరథాయ

దత్తవానితి. పక్షే కుశలోఽపి కార్యాకార్యవివేచకోఽపి పాండుర్దురదృష్టవశాత్ సుతాపాయ శోభనతాపాయ అతిపీడార్థం తపస్వినః శాపమ్ అవాప. శాపం కీదృశం ప్రియానువృత్తౌ సంభోగార్థం ప్రియానుసరణే నిబద్ధమృత్యుం నియతమరణరూపమ్. కిం భూతాత్తపస్వినః ఛన్నతనోర్మృగరూపేణావచ్ఛన్నదేహాత్ తథా శరేణ విభిన్నమూర్తేః తథా మహాధేః మహత్యా మానసవ్యథాయాః జనకాత్సంపాదకాత్. 60

**శ్లో॥ విషద్రుమస్య వ్యసనాహ్వయస్య ఫలం స లబ్ధ్వా సహసా నివృత్తః ।**
**కాన్తోపభోగేషు పరాఙ్ముఖాత్మా నినాయ కాలం నిరపత్యదుఃఖీ ॥ 61**

విషేతి. నిరపత్యేన అపత్యాభావేన దుఃఖీ ఖిద్యమానః, స దశరథః కాంతాః మనోజ్ఞాః ఉపభోగాః విషయాః తేషు పరాఙ్ముఖాత్మా నివృత్తమనాస్సన్ కాలం నినాయ నిరపత్య-దుఃఖితయా విషయరస మబహుమన్యమానః వృథా కాలక్షేపం చకారేత్యర్థః. కిం భూతః సహసా హఠాత్ వ్యసనాహ్వయస్య మృగయారూపవ్యసననామకస్య విషద్రుమస్య విషవృక్షస్య ఫలమ్ అభిశాపరూపం లబ్ధ్వా నివృత్తః మృగయావ్యాపారాత్పరాఙ్ముఖః. పక్షే కాంతయోః పత్న్యోః కుంతీమాద్ర్యోః ఉపభోగేషు సంభోగేషు శాపవశాత్ పరాఙ్ముఖాత్మా అత ఏవ నిరపత్యేన అపత్యోత్పత్త్యభావేన దుఃఖీ స పాండుః కాలం నినాయ అన్యత్సర్వం పూర్వవత్. 61

**శ్లో॥ అసన్తతేస్సన్తి కుతస్సుఖానీత్యస్యై విచిన్త్య ప్రతిపన్నమన్యుః ।**
**సమం స్వదారైర్నియతస్సుతార్థే రాజా సురప్రార్థనతత్పరోఽభూత్ ॥62**

అసంతతేరితి. అసంతతేరపుత్రస్య జనస్య ఇహాముత్ర చ కుతస్సుఖాని సంతి భవంతి నాపుత్రకస్య లోకోస్తి శ్రుతిరేషా సనాతనీ ఇత్యాది స్మరణాదితి. అస్యై సంతతయే విచింత్య ప్రతిపన్నో విహితో మన్యుర్యేన్జ్ఞో దైన్యం శోకో వా యేన తాదృశో రాజా దశరథః స్వదారైః స్వపత్నీభిః కౌసల్యాదిభిః సమం సహ నియతః కృతనియమస్సన్ సుతార్థే పుత్రలాభాయ సురాణాం దేవానాం ప్రార్థనే ఉపాసనే తత్పరః ఆసక్తోఽభూత్; పుత్రార్థం దేవానుపాసితవా-నిత్యర్థః. పక్షే ప్రతిపన్నమన్యుః గృహీతదైన్యో రాజా పాండుర్నియతస్సన్ స్వదారైః కుంతీ-మాద్రీభ్యాం సమం సురాణాం ధర్మాదీనాం ప్రార్థనే ఆహ్వానే తత్పరోఽభూత్; పూర్వం కుంత్యా శిక్షితేన దుర్వాససోపదిష్టేన మంత్రేణ ధర్మాదీన్ ఆకారితవానిత్యర్థః, విచింత్యాంతం సమానం. మన్యుర్దైన్యే క్రతౌ క్రుధి ఇతి, **హేమచంద్రః.** 62

**శ్లో॥ ఏతస్మిన్సతి సమయే విపక్షభీతాః క్షీరాబ్ధేస్తటభువమేత్య శక్రముఖ్యాః ।**
**గీర్వాణాః కృతనతిసూక్తయస్త్రిధామ్నే లోకానాముదితముపప్లవం శశంసుః ॥63**

ఏతస్మిన్నితి. యదా దశరథేన యదా చ పాండునా పుత్రార్థం సురారాధనాకృతా ఏతస్మిన్సమయే సతి వర్తమానే సతి శోభనే వా విపక్షేభ్యో రావణాదిభ్యః పక్షే కంసచైద్యాదిభ్యో భీతాః శక్రముఖ్యా ఇంద్రప్రధానా గీర్వాణా దేవాః క్షీరాబ్ధేః క్షీరసముద్రస్య తటభువం తీరప్రదేశం

ఏత్య ఆగత్య కృతాః నతయః ప్రణామాః సూక్తయః స్తుతయశ్చ యైస్తాదృశాః సన్తః త్రీణి స్వర్గమధ్యపాతాళరూపాణి ధామాని స్థానాని యస్య తస్మై త్రిధామ్నే సర్వవ్యాపకాయ విష్ణవే, ఉదితం రావణాదిద్వారా పక్షే కంసాదిద్వారా ఉత్పన్నం లోకానాం జనానామ్ ఉపప్లవమ్ ఉపద్రవం శశంసుః నివేదయామాసుః. త్రిధామ్నే ఇతి యదభిప్రేత్యేత్యాదినా చతుర్థీ. ధామ రశ్మౌ గృహే దేహే స్థానే జన్మ ప్రభావయోః ఇతి **హేమచంద్రః.** **ప్రహర్షణీవృత్తమిదం** మ్నౌజ్రౌగస్త్రిదశయతిః ప్రహర్షణీయమ్ ఇతి లక్షణాత్. 63

**శ్లో॥ సన్దిశ్య త్రిదశగణం యథానురూపం తేజోంశైర్భువి జననాయ తత్ర తత్ర ।**
**దైత్యారిస్తదను తమోనుదోఽన్వవాయే స్వైరంశైరవతరితుం చతుర్భిరైచ్ఛత్ ॥64**

సందిశ్యేతి. తదను తత్పశ్చాత్ దేవానాం లోకోపప్లవశంసనానంతరమిత్యర్థః దైత్యారిః విష్ణుః తేజోంశైః తేజోభాగైః యథానురూపం యథాయోగ్యం భువి పృథివ్యాం తత్ర తత్ర కిష్కింధాదౌ జననాయ సుగ్రీవాదిరూపేణ జన్మపరిగ్రహాయ త్రిదశగణం దేవగణం సందిశ్య స్వయం తమోనుదః సూర్యస్య అన్వవాయే వంశే దశరథగృహే చతుర్భిః స్వైః స్వకీయైః అంశైః భాగైః రామలక్ష్మణభరతశత్రుఘ్నరూపైరిత్యర్థః, అవతరితుమ్ అవతీర్ణో భవితుమ్ ఐచ్ఛత్; యూయమపి మదీయ్యసాహాయ్యార్థమ్ ఋక్షవానరాదిరూపేణ పృథివ్యామవతరతేతి దేవానాదిశ్య స్వయం రామాదిరూపేణ సూర్యవంశే అవతరితుమ్ ఇచ్ఛతి స్మేత్యర్థః. పక్షే తదను దైత్యారిర్భువి తత్ర తత్ర కుంత్యాదౌ యథానురూపం తేజోంశైః యుధిష్ఠిరాది-రూపైర్జననాయ త్రిదశగణం ధర్మాదిదేవానాదిశ్య స్వయం తమోనుదః చంద్రస్య అన్వవాయే యదువంశే చతుర్భిః స్వైరంశైః ప్రద్యుమ్నానిరుద్ధసంకర్షణవాసుదేవేతి చతుర్వ్యూహః శ్రీకృష్ణావతార ఇతి పౌరాణికాః. చంద్రాగ్న్యర్కాస్తమోనుదః **ఇత్యమరః**. పూర్వోక్తం వృత్తమ్. 64

**శ్లో॥ తతో మునివ్యాహృతమన్త్రయుక్త్యా తదీయపత్నీపరిచర్యయా చ ।**
**భక్త్యోపసత్త్యా చ నృపస్య జజ్ఞే పిణ్డోపలబ్ధిర్విబుధప్రసాదాత్ ॥ 65**

తత ఇతి. తత స్తదనంతరం మునినా ఋశ్యశృంగేణ వ్యాహృతా ఉక్తా యే మంత్రాః పుత్రేష్టివిషయికాః ఋచస్తేషాం యుక్త్యా ప్రయోగేణ తథా తదీయపత్నీనాం దశరథస్త్రీణాం కౌసల్యాదీనాం యా పరిచర్యా దేవానాం మునేర్వా సేవా తయా చ తథా, భక్త్యోపసత్త్యా భక్తిపూర్వికయా తదేకనిష్ఠతయా చ విబుధానాం దేవానాం ప్రసాదాత్ నృపస్య దశరథస్య పిండోపలబ్ధిః పుత్త్రోత్పత్త్యా పిండనిశ్చయః జజ్ఞే జాతా; తదీయపత్నీ ఋశ్యశృంగపత్నీ దశరథసుతా శాంతా తస్యాః పరిచర్యయా చేతి కేచిత్. పక్షే తతో నృపస్య పాండోర్విబుధానాం ధర్మాదీనాం ప్రసాదాత్ క్షేత్రజపుత్త్రోత్పత్త్యా పిండోపలబ్ధిర్జజ్ఞే; కయేత్యాహ మునినా దుర్వాససా వ్యాహృతః కుంత్యై దత్తో యోఽభీష్టదేవాహ్వానకృన్మంత్రః తద్రూపాయా యుక్తిః తయా తథా తదీయపత్న్యోః కుంతీమాద్ర్యోః పరిచర్యయా ధర్మాదీనామ్ ఉపాసనయా తథా భక్త్యా భక్తిద్వారా యా ఉపసత్తిః కుంతీమాద్ర్యోః యథాయథం ధర్మాదిషు సంగస్తయా చ దుర్వాసోదత్తమంత్రేణ

కుంత్యా క్రమేణ ధర్మపవనేంద్రాణామ్ ఆకారణా కృతా, తేన చాస్యా యుధిష్ఠిర భీమసేనార్జున–నామనస్త్రయః పుత్రా జాతాః, తదను మాద్ర్యా చ తథైవ అశ్వినావాకారితౌ తతశ్చ తస్యా అపి ద్వౌ పుత్రౌ నకులసహదేవనామానౌ జాతావిత్యర్థః. 65

**శ్లో॥ స్ఫురదృశ్యశృఙ్గవితతాన్యథాన్వహం సవనాన్తరాణ్యధిగతో మహీపతిః ।**
**చతురోఽపి పఞ్చముఖభాసురశ్రియస్తనయానవాప హరిదస్రతేజసః ॥66**

ఉక్తమర్థం వ్యాకరోతి స్ఫురదితి. అథ అనంతరం మహీపతిర్దశరథః అన్వహం ప్రతిదినం స్ఫురతా తపఃప్రభావాద్దీప్యమానేన ఋశ్యశృంగేణ మునినా వితతాని విహితాని సవనాంతరాణి యజ్ఞభేదాన్ యజ్ఞభేదజనితా దృష్టానీత్యర్థః. అధిగతః ప్రాప్తస్సన్ చతురోఽపి న కేవలమేకం చతుస్సంఖ్యాకానపి తనయాన్ రామలక్ష్మణభరరతశత్రుఘ్నరూపాన్ పుత్రానవాప ప్రాప్తవాన్; కిం భూతాన్ పంచముఖః శివః సింహో వా తద్వద్భాసురా దీప్తిశీలా శ్రీః యేషాం తాదృశాన్, తథా హరిరింద్రః దస్రౌ ఆశ్వినేయౌ స చ తౌ చేతి ద్వంద్వః తేజో బలం చ తేజః కాంతిశ్చేత్యేకశేషః హరిదస్రాణామివ తేజసీ యేషాం తాదృశాన్ ఇంద్రవద్బలవతః, అశ్వినీకుమారవత్ కాంతిమతశ్చేత్యర్థః. పంచా విస్తృతా ముఖేన భాసురా శ్రీర్యేషాం తానిత్యపరే. పక్షే అథ అన్వహం వనాంతరాణి వనమధ్యాని అధిగతస్స మహీపతిః పాండుః చతురోఽపి పుత్రోత్పత్త్యనుకూలసురతవ్యాపారనిపుణస్సన్నపి శాపవశాత్తదశక్తతయా అగత్యా హరిదస్రాణాం ధర్మవాయ్వింద్రాశ్వినీకుమారాణాం తేజసో వీర్యాత్ పంచతనయాన్ యుధిష్ఠిరాదీనవాప. స్వస్యౌరసోత్పాదనసామర్థ్యాభావాత్ ధర్మాదిషు నియోగేన క్షేత్రజాన్ పంచపుత్రాన్ ప్రాప్తవానిత్యర్థః. కిం భూతాని వనాంతరాణి స్ఫురంతః ఋశ్యాః మృగవిశేషాః యత్ర తాదృశాని యాని శృంగాణి పర్వతశిఖరాణి తేషు వితతాని విస్తృతాని; కిం భూతాన్ తనయాన్ ముఖేన భాసురా శ్రీః యేషాం తాన్ ప్రశస్తముఖశాలిన ఇత్యర్థః, హరిదస్రేతి హరిశబ్దేన ఏకశేషవశాత్ తాత్పర్యవిశేషగ్రహాద్వా ధర్మవాయ్వింద్రాస్త్రయోఽభిధీయంతే, యద్యపి హరిశబ్దస్య సాక్షాద్ధర్మవాచకత్వం న దృష్టం; తథాపి సర్వధర్మాత్మక విష్ణువాచకత్వాత్ యమవాచకత్వాద్వా తథా కల్పయితుం శక్యతే. అంతరమవకాశావధి పరిధానాంతర్ధి–భేదతాదర్థ్యే । ఛిద్రాత్మీయవినా బహిరవసరమధ్యాత్మసదృశేషు ఇతి. తేజో దీప్తౌ ప్రభావే చ స్యాత్పరాక్రమ రేతసోః ఇతి చ **మేదినీ**. హరిర్వాతార్కచంద్రేంద్రయమోపేంద్రమరీచిషు । ఇతి **విశ్వః**. **మంజుభాషిణీ వృత్తం** సజసాజగౌ చ యది మంజుభాషిణీ ఇతి లక్షణాత్. 66

**శ్లో॥ కృతార్థతా కీదృగహో నృపస్య యదేనమాలంబితపుత్రమూర్తిః ।**
**దేవః స్వయం ధర్మమయస్సిషేవే సహానుజన్మా గురుభక్తినమ్రః ॥67**

కృతార్థతేతి. అహో విస్మయే నృపస్య దశరథస్య పక్షే పాండోః కృతార్థతా కృతకృత్యతా కీదృక్ అనిర్వచనీయేత్యర్థః. యత్ యస్మాదేనం నృపమ్ ఆలంబితా గృహీతా పుత్రమూర్తిః పుత్రరూపం యేన తాదృశస్సన్, ధర్మమయో ధర్మరూపీ దేవో విష్ణుః శ్రీరామరూపేణ పక్షే

ధర్మమయః సాక్షాద్ధర్మో దేవో యుధిష్ఠిరరూపేణ స్వయం సిషేవే; కిం భూతః అనుజన్మభిః భరతాదిభిః పక్షే భీమాదిభిస్సహ వర్తమానః తథా గురౌ పిత్రాదౌ యా భక్తిః తయా నమ్రః దర్శితవినయః. 67

**శ్లో॥ స లక్ష్మణోన్నీతసమృద్ధిరుద్యచ్ఛత్రుఘ్నసమ్పద్భరతైధితశ్రీః ।**
**జ్యాయాన్ విరేజే క్రమశోఽభిరామః కౌమారమాసాద్య వయః కుమారః ॥68**

స ఇతి. స రామో రామనామా జ్యాయాన్ జ్యేష్ఠః కుమారో రాజపుత్రః కౌమారం బాల్యం వయ ఆసాద్య విరేజే శుశుభే కౌమారం యౌవనమితి కేచిత్; కిం భూతం వయః క్రమేణ శోభత ఇతి క్రమశోభి యద్వా నాస్తిభీర్యత్ర తత్ అభి క్రమశః క్రమేణ అభి భయశూన్యం వయసో విశేషణం; స కింభూతః లక్ష్మణేన లక్ష్మణనామకభ్రాతా ఉన్నీతా ఉచ్చతాం ప్రాపితా సమృద్ధిః శోభాసంపత్తిర్యస్య సః; తథా ఉద్యతీ ప్రకాశమానా శత్రుఘ్నేన తన్నామక భ్రాతా సమ్పత్ శోభాధిక్యం యస్య సః, ఉద్యతః శత్రుఘ్నాత్ సంపద్యస్యేతి వా; తథా భరతేన భరతనామకభ్రాతా ఏధితా వర్ధితా శ్రీః శోభా యస్య సః, ఏతేన రామలక్ష్మణభరతశత్రుఘ్నాః చత్వారో భ్రాతర ఇతి సూచితమ్. పక్షే స జ్యాయాన్ కుమారో యుధిష్ఠిరః కౌమారం వయ ఆసాద్య విరేజే కిం భూతః లక్ష్మణేన సామ్రాజ్యవ్యంజకపద్మాదిచిహ్నేన ఉన్నీతా అనుమితా సమృద్ధీ రాజ్యసంపత్తిర్యస్య సః, తథా ఉద్యతీ స్పష్టం లక్ష్యమాణా శత్రుఘ్నీ రిపునాశికా సంపద్యస్య సః; తథా భరతస్య భరతవంశస్య ఏధితా శ్రీర్యేన సః; భరతస్య నృపవిశేషస్యేవ ఏధితా శ్రీర్యస్యేతి వా; అథవా భరతో నటస్తద్వత్ ఏధితా బాంధవైః కల్పితా శ్రీర్యస్య సః బాంధవైర్నటవత్ బాలానాం వేషః క్రియతే ఇతి వ్యవహారః; తథా క్రమశః క్రమేణ వయోవృద్ధ్యా అభిరామః మనోజ్ఞః. లక్ష్మణం లాంఛనే నామ్ని రామభ్రాతరి లక్ష్మణః ఇతి **విశ్వః**. రామానుజే నాట్యశాస్త్రే దౌష్యన్తౌ భరతో నటే ఇతి **పురుషోత్తమః**. 68

**శ్లో॥ యుధిష్ఠిరం భీమధనఞ్జయాభ్యాం సమం దధానం నకులేన లక్ష్మీమ్ ।**
**సమాదవాప్తం సహదేవనిష్ఠం జ్యేష్ఠం సుతం వీక్ష్య తుతోష తాతః ॥69**

యుధిష్ఠిరమితి. తాతో దశరథః జ్యేష్ఠం సుతం రామం వీక్ష్య దృష్ట్వా తుతోష; కిం భూతం యుధిష్ఠిరం సంగ్రామస్థిరం సంగ్రామాదపలాయినమిత్యర్థ, తథా భీమో రుద్రః ధనంజయో వహ్నిః తాభ్యాం సమం సదృశం రుద్రవహ్నివత్తేజస్వినమిత్యర్థః; తథా కులే వంశే లక్ష్మీం శోభాం నన దధానం ధారయంతం నఞ్ద్వయస్య ప్రకృత్యర్థావగమకత్వాత్ కులం శోభయంతమిత్యర్థః; తథా సమాత్ సాధోః ఋశ్యశృంగాత్ అవాప్తం ప్రాప్తమ్ ఋశ్యశృంగకృతయజ్ఞఫలాత్ ప్రాప్తమిత్యర్థః మా లక్ష్మీస్తయా సహవర్తత ఇతి సమః విష్ణుస్తస్మాదవాప్తం నారాయణాంశసంభూతమితి వా తథా దేవనిష్ఠయా దేవేషు భక్త్యా సహవర్తత ఇతి సహదేవనిష్ఠః తమ్. పక్షే తాతః పాండుః యుధిష్ఠిరం యుధిష్ఠిరనామకం జ్యేష్ఠం సుతం వీక్ష్య తుతోష; కిం భూతం భీమధనంజయాభ్యాం భీమసేనార్జునాభ్యాం సమం

సహితం; తథా నకులేన నకులనామకభ్రాత్రా లక్ష్మీం దధానం; తథా సమాత్ పూర్వోక్త–వ్యుత్పత్త్యా నారాయణాత్ అవాప్తం సమం సామ్యమ్ అతతి గచ్ఛతీతి సమాత్ పంచసు సమానస్నేహవాన్ ఇతి తాతవిశేషణమ్, అవాప్తం ప్రాక్తనపుణ్యబలాల్లబ్ధమితి వా తథా సహదేవే సహదేవనామక భ్రాతరి నిష్ఠా అనురాగో యస్య తమ్. భీమోఽమ్లవేతసే ఘోరే శంభౌ మధ్యమపాండవే ఇతి. ధనంజయోఽర్జునే వహ్నినాగభిద్దేహమారుతే ఇతి, సర్వసాధుసమానేషు సమం స్యాదభిధేయవత్ ఇతి చ **మేదినీ.** 69

**శ్లో॥ సన్తానలాభాదనృణః పితౄణాం హర్షాదసంభావితపూర్వశాపః ।**
**సార్ధం స్వదారైరనుభూతకామః స శక్రతోషైకరతిర్బభూవ ॥ 70**

సంతానేతి. స్వదారైః కౌసల్యాదిభిః సార్ధమ్ అనుభూతాః కామా విషయా యేన తాదృశః స దశరథః యజ్ఞాద్యనుష్ఠానేన అసురవినాశనేన వా శక్రస్య ఇంద్రస్య తోషే ఏకా కేవలా రతిరనురాగో యస్య తాదృశో బభూవ నిశ్చింతతయా యజ్ఞాదినా కేవలమింద్రం తోషయా–మాసేత్యర్థః. కిం భూతః సంతానలాభాత్ పుత్త్రప్రాప్త్యా పితౄణామనృణః పితౄణముక్తః ప్రజయా పితృభ్య ఇతి శ్రుతేః; అత ఏవ హర్షాత్ సంతానలాభజనితానందాత్ అసంభావితోఽచింతితః అంధమునిదత్తః పూర్వశాపో యేన సః. పక్షే హర్షాత్ అసంభావితో విస్మృతః పూర్వశాపో మృగరూపిమునినాదత్తః సురతాసక్తో మరిష్యసీత్యేవం రూపో యేన తాదృశస్స పాండుః స్వదారైర్మాద్ర్యా సార్ధమ్ అనుభూతకామః మాద్ర్యాం కామాసక్తస్సన్ శక్రతోషైక–రతిర్బభూవ. మాద్రీముపగమ్య పూర్వోక్తశాపవశాత్ప్రాణాన్విహాయ ఇంద్రలోకం గత్వా తత్రావస్థానేన నిరంతరమింద్రం తోషయామాసేత్యర్థః. అనుభూతకామస్సన్స్వదారైస్సార్ధం శక్రతోషైకరతిర్బభూవేతి వా మాద్ర్యాస్సహమరణశ్రవణాత్ తయా సార్ధమ్ ఇంద్రలోకం జగామేత్యర్థః. అన్యత్సమానమ్. 70

**శ్లో॥ విద్యా గురూణాం నిలయాదవాప్య కాలే కుమారా ధృతరాష్ట్రమేత్య ।**
**వవందిరే భూమిపతిం జనానాం విలోచనాళీరనిమేషయన్తః ॥ 71**

విద్యా ఇతి. కుమారా రామాదయః కాలే అధ్యయనోపయుక్తసమయే గురూణాం వసిష్ఠాదీనాం నిలయాద్గృహాత్ విద్యాః అవాప్య ధృతం రక్షితం రాష్ట్రం రాజ్యం యేన తాదృశం భూమిపతిం దశరథమ్ ఏత్య ఆగత్య వవందిరే ప్రణేముః. కిం భూతాః జనానాం ప్రేక్షకాణాం విలోచనాళీః నయనపఙ్క్తీః అనిమేషయంతః నిమేషశూన్యాః కుర్వంతః ప్రేక్షకానతితరా–మానందయన్త ఇత్యర్థః. పక్షే కుమారా యుధిష్ఠిరాదయః కాలే పాండుమరణోత్తరం విద్యాగురూణామ్మునీనాం నిలయాత్ తపోవనాత్ ఏత్య మునిభిస్సార్ధమాగమ్య ధృతరాష్ట్ర–నామానం భూమిపతిం పాండుజ్యేష్ఠమ్ అవాప్య వవందిరే; అన్యత్సమానం. శ్లిష్టకావ్యే వ్యవహితయోజనా న దోషాయేతి నకష్టత్వమ్. ధృతరాష్ట్రస్సురాజ్ఞి స్యాత్పక్షిక్షత్రియభేదయోరితి **విశ్వః.** 71

శ్లో॥ గుణైరుపేతా గురుభీష్మహృద్యైః క్షత్త్రానురూపైర్వచనైర్వినీతాః ।
కృపాశ్రయాస్తే కుశలాః కలాసు ప్రమాణకోటిప్రవణా విజహ్రుః ॥72

గుణైరితి. తే రామాదయః విజహ్రుః విహారం చక్రుః, కిం భూతాః గురుభిః గభీరైః భీష్మైః శత్రూణాం భయదైః హృద్యైస్సాధూనాం మనోజ్ఞైః గుణైరుపేతా యుక్తాః తథా క్షత్త్రానురూపైః క్షత్రియయోగ్యైర్వచనైః వినీతాః గురుభిశ్శిక్షితాః తథా కృపాయాః దయాయాః ఆశ్రయాః ఆధారాః నీచేషు దయావంత ఇత్యర్థః; తథా కలాసు చతుష్షష్టిప్రకారవిద్యాసు కుశలాః తథా ప్రమాణానాం హేతూనాం కోటౌ కోటిసంఖ్యకేష్వపి హేతువాదేష్విత్యర్థః ప్రవణాః నిపుణాః ప్రమాణానాం సత్యవాదినాం కోటౌ అగ్రే ప్రవణాః సత్యవాదినామగ్రగణ్యా ఇత్యర్థ ఇతి వా; ప్రమాణానాం శాస్త్రాణాం కోటావుత్కర్షే ప్రవణా ఇతి కేచిత్; ప్రమాణం నిత్యమర్యాదాశాస్త్రేషు సత్యవాదిని ఇయత్తాయాం చ హేతౌ చ క్లీబైకత్వే ప్రమాతరీతి; కోటిః స్త్రీ ధనుషోఽగ్రేఽశ్రౌ సంఖ్యాభేదప్రకర్షయోః, ఇతి చ **మేదినీ.** పక్షే తే యుధిష్ఠిరాదయః విజహ్రుః; కిం భూతాః గురుః ద్రోణాచార్యః భీష్మః శాంతనవః తయోః హృద్యైః హృదయంగమైః గుణైరుపేతా తథా క్షత్త్రా విదురేణ అనురూపైః యోగ్యైః వచనైః వినీతాః అస్మిన్పక్షే **క్షత్త్రేతి తృతీయాంతం** భిన్నం పదం; తథా కృపః కృపాచార్యః ఆశ్రయో గురుర్యేషాం తే; తథా కలాసు కుశలాః తథా ప్రమాణకోటిః కౌరవాణాం క్రీడాభూమిః తత్ర ప్రవణాః విదురస్య విచిత్ర వీర్యదాస్యాం జాతత్వాత్ క్షత్తృశబ్దవాచ్యత్వం. క్షత్తా శూద్రాత్క్షత్రియజే ప్రతీహారే చ సారథౌ । భుజిష్యాతనయేపి స్యాత్ నియుక్తవేధసోః పుమాన్, ఇతి **మేదినీ.** 72

శ్లో॥ తే స్నిగ్ధగంభీరగిరః కుమారాస్త్రైలోక్యతాపప్రశమాయ దక్షాః ।
నవాంబువాహా ఇవ ధార్తరాష్ట్రానుద్వేజయన్తి స్మ చిరం విపక్షాన్ ॥73

త ఇతి. తే కుమారా రామాదయః విపక్షాన్ శత్రూన్ చిరముద్వేజయంతిస్మ భీషితవంతః; ఉపమినోతి నవాంబువాహా ఇవ ధార్తరాష్ట్రానితి. యథా నవాంబువాహాః నవీనమేఘాః విపక్షాన్ వికృతపక్షయుక్తాన్ ధార్తరాష్ట్రాన్ హంసవిశేషాన్ ఉద్వేజయంతి మానసగమనాయ వ్యాకులయంతి తథేత్యర్థః. కిం భూతాః కుమారా నవాంబువాహాశ్చ స్నిగ్ధాః స్నేహవ్యంజికాః అథ చ, అరూక్షాః గంభీరాః దుర్బోధాభిప్రాయాః అథ చ విశాలాః గిరః వచనాని అథ చ నిర్ఘోషా యేషాం తే; తథా త్రైలోక్యతాపప్రశమాయ దక్షాః ఉపద్రవనిరాకరణేన మేఘపక్షే జలవర్షణేన త్రిలోకీతాపశాంత్యై నిపుణాః, వర్షాకాలే మేఘోదయాత్ ఉద్విగ్నచిత్తాః వికృత–పక్షాశ్చ భూత్వా హంసా మానససరోవరం గచ్ఛంతీతి కవీనాం సమయః. పక్షే తే కుమారా యుధిష్ఠిరాదయః చిరం విపక్షాన్ బహుకాలం జాతవైరాన్ ధార్తరాష్ట్రాన్ ధృతరాష్ట్రపుత్త్రాన్ దుర్యోధనాదీన్ నవాంబువాహా ఇవ ఉద్వేజయంతి స్మ యథా నవాంబువాహాః ధార్తరాష్ట్రాన్ హంసవిశేషాన్ ఉద్వేజయంతి తథేత్యర్థః. అన్యత్సర్వం పూర్వవత్, ఉపమేయం శ్రౌతీ. ధార్తరాష్ట్రోఽసితాస్యాంఘ్రిహంసే కౌరవసర్పయోః ఇతి, **మేదినీ.** 73

శ్లో॥ గురుకృపోపనతాయుధవిద్యయా సమధికం పరిబృంహితతేజసః ।
పవనసంగతపావకసన్నిభా నృపసుతాః పరభీషణతాం దధుః ॥ **74**

ఉక్తమర్థం దృఢయతి గుర్వితి. నృపసుతా రామాదయః పరభీషణతాం శత్రూణాం భయంకరత్వం దధుః ధృతవంతః; కిం భూతాః గురూణామ్ ఆచార్యాణాం కృపయా అనుగ్రహేణ ఉపనతా ప్రాప్తా యా ఆయుధవిద్యాధనుర్వేదస్తయా సమధికం యథా స్యాత్తథా పరిబృంహితాని సంవర్ధితాని తేజాంసి యేషాం తే; అత ఏవ పవనసంగతో వాతోద్దీపితో యః పావకో వహ్నిస్తస్య సన్నిభాసా దృశ్యం యేషాం తే. పక్షే నృపసుతాః యుధిష్ఠిరాదయః గురుర్ద్రోణః కృపశ్శారద్వతః తాభ్యామ్ ఉపనతా యా ఆయుధవిద్యా తయా పరిబృంహిత తేజసః; అన్యత్సమానమ్. **ద్రుతవిళంబితం వృత్తమ్** ద్రుతవిళంబితమాహ – నభౌభరౌ ఇతి లక్షణాత్. 74

శ్లో॥ రసప్రసంగైరపరాజితానాం ద్విజిహ్వామార్గైర్న వశీకృతానామ్ ।
తీవ్రప్రతాపజ్వలనేన తేషాం భావ్యం భయం శత్రుగణోఽనుమేనే ॥**75**

రసేతి. శత్రుగణః తేషాం రామాదీనాం తీవ్రో దుస్సహో యః ప్రతాపజ్వలనః ప్రతాపాగ్నిః తేన, భావ్యం భావి, భయమ్ అనుమేనే నిశ్చితవాన్; తేషాం దుస్సహప్రతాపం దృష్ట్వా ఏతేభ్యోఽస్మాకం భయం భవిష్యతీతి నిశ్చితవానిత్యర్థః. తీవ్రప్రతాపజ్వలనేన హేతునా తేషాం భావ్యమ్ ఉత్పాదనీయం భయమితి వా అస్మిన్వ్యాఖ్యానే తేషామితి **కర్తరిషష్ఠీ**. నన్వాస్తాన్నామ– దుస్సహ ప్రతాపః యువానస్తే శృఙ్గారాదిపరతన్త్రా భవిష్యన్తి తతశ్చ ఖలవ్యవహారైః సుకరమేవ తేషాం వశీకరణం, కథం భయసంభావనేత్యాశంకాం విశేషణాభ్యాం నిరాకరోతి. తేషాం కిం భూతానాం రసస్య శృంగారాదేః ప్రసంగైః యోగైః అపరాజితానామ్ అనభిభూతానాం జితేంద్రియాణామిత్యర్థః; తథా ద్విజిహ్వా మార్గైః ఖలవ్యవహారైర్న వశీకృతానామ్ అనాయత్తానామ్ అతిబుద్ధిమతామిత్యర్థః; యే హి జితేంద్రియా బుద్ధిమంతః ప్రతాపినశ్చ తేభ్యో భయసంభావనా యుజ్యత ఏవేతి భావః. పక్షే శత్రుగణో దుర్యోధనప్రభృతిః రసప్రసంగైః విషప్రదానైః అపరాజితానాం వినాశయితుమశక్తానాం తథా ద్విజిహ్వానాం సర్పాణాం మార్గైః అన్వేషణైః దంశనాదిభిర్న వశీకృతానాం న వినాశితానాం తేషాం యుధిష్ఠిరాదీనాం తీవ్రః ప్రతాపః ఉత్తాపో యస్య తాదృశో జ్వలనః లాక్షాగృహానలః తేన భావ్యం సంపాదనీయం భయం అనుమేనే; ఏతే హి విషప్రదానాదిభిర్న మృతాః ఇదానీం లాక్షామయం గృహం కృత్వా తత్ర ప్రవేశ్య వహ్నినా వినాశయితవ్యా ఇతి నిశ్చితవానిత్యర్థః. రసప్రసంగైః వాసుకి సందిష్టామృత– భోజనైః అపరాజితానాం పరాభవితుమశక్తానామితి వా, దుర్యోధనః కిల జలక్రీడావసరే సవిషం భోజ్యం భీమాయాదాత్, తద్భుక్త్వా విసంజ్ఞం తం నద్యాం ప్రాక్షిపత్, తతశ్చ తదవస్థో భీమో నాగలోకం ప్రవిష్టః, తత్ర చ సర్పైర్దంశనాద్విషాపాయేన ప్రత్యుజ్జీవితః సర్పాణాం కదనం కృతవాన్; తతశ్చ తైర్విజ్ఞాపితో వాసుకిః సర్వం జ్ఞాత్వా పరితుష్య భీమం

రసం పాయయామాస, యేన సోఽతిబలవాన్ బభూవేతి **భారతీవార్తా**. రసస్స్వాదే జలే వీర్యే శృంగారాదౌ విషే ద్రవే, ఇతి, ద్విజిహ్వః ఖలసర్పయోః, ఇతి చ **హేమచంద్రః**. 75

**శ్లో॥ ఏవం కాలే యాతి భగ్నారి రక్షో దీవ్యచ్చేతో బాధితుం గాధిజన్మా ।**
**భీమద్వేషీ భూమిపాలం యయాచే దాయాదస్య ప్రేషణం ధర్మయోనేః ॥76**

ఏవమితి. ఏవమిత్థం కాలే యాతి గచ్ఛతి సతి గాధిజన్మా విశ్వామిత్రః భూమిపాలం దశరథం ధర్మయోనేః ధర్మోత్పాదకస్య దాయాదస్య సుతస్య రామస్య ప్రేషణం యజ్ఞరక్షార్థం తపోవనే ప్రేరణం యయాచే ప్రార్థయామాస; కిం కర్తుమిత్యాహ, రక్షో యజ్ఞవిఘాతకం రాక్షసం తాటకాదికం బాధితుం పీడయితుం వినాశయితుమితి యావత్. కిం భూతం రక్షః భగ్నారి భగ్నా అరయో యతస్తత్ అతిబలవదిత్యర్థః; తథా దీవ్యత్ నిర్భయత్వాత్ క్రీడత్ సోత్సాహమిత్యర్థః తాదృశం చేతో యస్య తత్, గాధిజన్మా; కిం భూతః భీమానాం భయంకరాణాం రాక్షసాదీనాం ద్వేషీ శత్రుః. రక్ష ఇతి **జాత్యాశ్రయత్వాదేకవచనమ్**. పక్షే భీమం వృకోదరం ద్వేష్టీతి భీమద్వేషీ దుర్యోధనః భూమిపాలం ధృతరాష్ట్రం ధర్మాద్యోని-రుత్పత్తిర్యస్య తాదృశస్య ధర్మసుతస్య దాయాదస్య జ్ఞాతేః యుధిష్ఠిరస్య ప్రేషణం వారణావతే ప్రేరణం యయాచే ఇతో యుధిష్ఠిరాదయో వారణావతే యాం త్వితి ధృతరాష్ట్రం ప్రార్థయా-మాసేత్యర్థః. అస్య ధర్మయోనేర్యుధిష్ఠిరస్య దాయాత్ స్వపిత్ర్యంశాత్ ప్రేషణం భ్రంశనం యయాచే ఇతి వా; కిం భూతః భగ్నా విఘటితా అరీణాం పాండవానాం రక్షారక్షణం యేన సః, తథా దీవ్యచ్చేతః సునిర్వృతం మనః తద్బాధతే ఇతి దీవ్యచ్చేతో బాధీ తాదృశో యస్తుంగః ప్రబలతరాధిః మానసవ్యథా తస్య జన్మ ఉత్పత్తిర్యత్ర సః. ఉభయత్రాపి భూమిపాలమితి గౌణం కర్మ. దాయాదౌ సుతబాంధవౌ **ఇత్యమరః**. **శాలినీవృత్తమిదమ్**. శాలిన్యుక్తామ్తౌ తగౌ గోఽబ్ధిలోకైః ఇతి లక్షణాత్. 76

**శ్లో॥ తద్వాక్యాన్తే దత్తకర్ణానుమోదః పుత్త్రప్రీత్యా జాతకృచ్ఛ్రః కుమారమ్ ।**
**ధర్మాత్మానం ప్రేషయామాస రామం విశ్వామిత్రప్రీతయే భూమిపాలః ॥77**

తదితి. భూమిపాలో దశరథః విశ్వామిత్రస్య మునేః ప్రీతయే ధర్మాత్మానం సాక్షాద్ధర్మ స్వరూపం కుమారం రామం దూరం దూరదేశం తపోవనం ప్రేషయామాస; కిం భూతః తద్వాక్యాంతే తస్య మునేః వాక్యావసానే పుత్త్రప్రీత్యా పుత్రస్నేహపరవశతయా జాతం కృచ్ఛ్రం వియోగదుఃఖం యస్య తాదృశస్సన్నపి శాపభయాత్ దత్తః కర్ణయోః మునేశ్శ్రవణయోః అనుమోదః పుత్త్రం ప్రేషయిష్యామీతి వాక్యజనితహర్షో యేన సః; స్నేహాధిక్యాద్వ్యాకులోపి శాపభయాద్రామం ప్రేషయామామాసేత్యర్థః. పక్షే భూమిపాలో ధృతరాష్ట్రః విశ్వేషామ్ అమిత్రాణాం సర్వేషాం శత్రూణామ్ అథవా విశ్వేషామ్ అమిత్రా దుర్యోధనాదయః తేషాం ప్రీతయే ధర్మాత్మానం ధర్మజం కుమారం యుధిష్ఠిరం దూరమ్ అర్థాత్ రచితలక్షాగృహం వారణావతే ప్రేషయామాస; కిం భూతః తస్య దుర్యోధనస్య వాక్యాంతే దత్తః కర్ణేన రాధేయేన

ఆమోదో హర్షో యస్మై సః కర్ణేన ప్రోత్సాహిత ఇత్యర్థః; అత ఏవ పుత్త్రప్రీత్యా దుర్యోధనాదీనాం స్నేహానురోధేన అజాతం కృచ్ఛ్రం భ్రాతుః పుత్రవియోగజనితదుఃఖం యస్య సః; దత్తకర్ణా-నుమోద ఇతి ఉభయత్రాపి **వ్యధికరణబహువ్రీహిః**. కర్ణః పృథాజ్యేష్ఠసుతే సువర్ణాలౌ శ్రుతావపీతి **మేదినీ**. పూర్వోక్తం వృత్తమ్. 77

**శ్లో॥ మాత్రా సమం సావరజః స రాజ్ఞా ప్రస్థాపితో ధామ తపోధనానామ్ ।**
**స్థానాన్తరం విద్విషతాం రణేషు సమర్థకోదణ్డధరః ప్రతస్థే ॥ 78**

మాత్రేతి. స రామః తపోధనానాం మునీనాం, ధామ గృహరూపం, స్థానాంతరమ్ అయోధ్యాతో భిన్నస్థానం ప్రతస్థే ప్రస్థితవాన్; కిం భూతః మాత్రా సమం కౌసల్యయా సహితేన రాజ్ఞా దశరథేన ప్రస్థాపితః గంతుం ప్రేరితః; తథా సావరజః అవరజేన కనిష్ఠేన లక్ష్మణేన సహ వర్తమానః; తథా విద్విషతాం శత్రూణాం, రణేషు సమర్థం ఆమర్దసహం కోదండం ధనుర్ధరతి ధారయతీతి తాదృశః; ధామేతి ప్రస్థాపిత ఇత్యస్య వా కర్మ. పక్షే రాజ్ఞా ధృతరాష్ట్రేణ ప్రస్థాపితస్స యుధిష్ఠిరః హస్తినాతః స్థానాంతరం వారణావతం ప్రతస్థే, న కేవలమేక ఏవ ప్రతస్థే కింతు మాత్రాదిభిరపీత్యాహ, కిం భూతః మాత్రా సమం కుంత్యా సహితః తథా అవరజైః భీమాదిభిస్సహ వర్తమానః, తథా తపోధనానాం స్నాతకబ్రాహ్మణానాం ధామ ప్రతిపాలకత్వాదాశ్రయః. ప్రస్థాపనే హేతుగర్భవిశేషణద్వయమాహ, పునః కిం భూతః రణేషు సమర్థకః శత్రూన్పీడయితుం శక్త ఇత్యర్థః. తథా విద్విషతాం దుర్యోధనాదీనాం దండధరః బలవత్వాద్దండకర్తా సమర్థక ఇతి **స్వార్థేకః**. 78

**శ్లో॥ పరికల్పితకామదేహదాహం విషయం ప్రాప్య స వారణావతంసః ।**
**అవిశఙ్కమువాస తత్ర భాస్వద్ద్యుతిలక్షాభవనే ప్రదోషరుద్ధః ॥ 79**

పరీతి. వా శబ్దః పూర్వాపేక్షయా సముచ్చయే సవాస చ రామః ప్రదోషేణ సాయం కాలోపస్థిత్యా రుద్ధః రుద్ధగమనస్సన్ పరికల్పితో మహాదేవేన జనితః కామస్య కందర్పస్య దేహస్య దాహో యత్ర తాదృశం విషయం గంగాసరయూసంగమసంనిధౌ కామతపోవన-రూపమ్ అంగదేశం ప్రాప్య తత్ర భాస్వతస్సాయంకాలీన సూర్యస్య ద్యుత్యా లోహితకిరణేన లాక్షాభం లాక్షావల్లోహితాయమానం యద్వనం తస్మిన్ అవిశంకం నిర్భయం యథా తథా ఉవాస; కిం భూతః రణావతంసః సమరనిపుణః, కల్పవిశేషే అంగదేశే భగవతా శివేన కామో దగ్ధః తథాహి వాల్మీకీయే బాలకాండే '**కందర్పో మూర్తిమానాసీత్ కామ ఇత్యుచ్యతే బుధైః । తపస్యంతమిహ స్థాణుం నియమేన సమాహితమ్ । కృతోద్వాహం తు దేవేశం గచ్ఛంతం సమరుద్గణమ్ । ధర్షయామాస దుర్మేధాహుంకృతశ్చ మహాత్మనా । అవధ్యాతశ్చ రుద్రేణ చక్షుషా రఘునందన । వ్యశీర్యంతశరీరాత్స్వాత్సర్వగాత్రాణి దుర్మతేః । తత్ర గాత్రం హతం తస్య నిర్దగ్ధస్య మహాత్మనా । అశరీరః కృతః కామః క్రోధాద్దేవేశ్వరేణ హ । అనంగ ఇతి విఖ్యాతస్తదా ప్రభృతిరాఘవ । సచాంగవిషయశ్శ్రీమాన్ యత్రాంగం సముమోచ హ**"

ఇతి విశ్వామిత్రవాక్యమ్. పక్షే స యుధిష్ఠిరః పరికల్పితో దుర్యోధనాదిభిరాకాంక్షితః కామేనేచ్ఛయా పాండవానాం దేహదాహో యత్ర తాదృశం సవారణావతం వారణావత నామక నగరీసహితం విషయం దేశం ప్రాప్య తత్ర భాస్వతీ దేదీప్యమానా ద్యుతిః కాంతిర్యస్య తాదృశం యల్లాక్షాభవనం జతుగృహం తస్మిన్ విగతా శంకా యత్ర క్రియాయాం తద్విశంకం నవిశంకమ్ అవిశంకం యథా తథా ఉవాస విదురవచనేన శత్రుచేష్టితజ్ఞానాత్ సశంక–మువాసేత్యర్థః. కిం భూతః ప్రదోషైః ప్రకృష్టదూషణశాలిభిః దుర్యోధనానుచరైః పురోచనాదిభీ రుద్ధః ఆవృతః కామస్య రాజ్యప్రాప్త్యభిలాషస్య దేహస్య చ దాహో యత్రేతి వా. పరికల్పితేత్యత్ర పరికల్పితేతి పాఠే రామాయణ పక్షే పరమతిశయేనేతి, భారతపక్షే పరేణ శత్రుణేత్యర్థః. దేశవిషయౌ తూపవర్తనమ్ **ఇత్యమరః**. **వైతాళీయభేదఔపచ్ఛందసికం వృత్తం** షడ్విషమేష్టౌ సమేకలాస్తాశ్చ సమేస్యుర్నో నిరంతరాః । న సమాత్ర పరాశ్రితా కలా వైతాళీయేంతే రలౌ గురుః తత్రైవాంతేఽధికే గురౌ స్యాదౌపచ్ఛందసికం కవీంద్రహృద్యమ్ ఇతి లక్షణాత్. 79

**శ్లో॥ ఉపనతజనక్లప్తః శ్లాఘ్యమార్గే చ తస్మిన్**
**విదురవచనమారాదాప్తభావేన శృణ్వన్।**
**అనయదపి కియన్తం కార్యమాలోక్య కాలం**
**ప్రకటితగురుభక్తిస్సానుజో రాజసూనుః ॥ 80**

ఉపనతేతి. చకారోఽపిశ్చ పూర్వాపేక్షయా సముచ్చయే సానుజః సలక్ష్మణః రాజసూనూ రామః ఆప్తభావేన ప్రత్యయితత్వజ్ఞానేన విదురస్య పండితస్య విశ్వామిత్రస్య వచనమ్ ఇహైవాద్య స్థీయతామిత్యేవం రూపం శృణ్వన్సన్ తస్మిన్ననంగతపోవనే కార్యం సాయం సంధ్యాదిరూపం ఆలోక్య పరామృశ్య సాయం సంధ్యాద్యర్థమిత్యర్థః. ఆరాత్ విశ్వామిత్రస్య సమీపే కియంతం కాలమ్ అనయత్ ఏకాం రాత్రిం గమయామాసేత్యర్థః. కిం భూతః ప్రకటితా ప్రకాశితా గురౌ విశ్వామిత్రే భక్తిర్యేన సః తస్మిన్కిం భూతే ఉపనతాస్తత్రోపస్థితా యే జనా మునయః తైః క్లప్తః కృతః శ్లాఘ్యః ప్రశంసనీయో మార్గో వర్త్మ యత్ర తత్తథా తస్మిన్ పక్షే సానుజో భీమాదిసహితో రాజసూనుర్యుధిష్ఠిరః ఆరాత్ సమీపే విదురస్య కౌరవమంత్రిణో వచనం రాజానం బోధయామాస, విదురో మ్లేచ్ఛభాషయా ఇత్యాద్యాక్షిప్తం లాక్షాగృహే తస్మిన్ సావధానతయా వస్తవ్యమిత్యాదిరూపమ్ ఆప్తభావేన శృణ్వన్సన్ భవిష్యత్కిమపి కార్యమాలోక్య తస్మిన్ లాక్షాగృహే కియంతం కాలమనయత్ కిం భూతః ప్రకటితా బహిః ప్రకాశితా గురౌ ధృతరాష్ట్రే భక్తిర్యేన సః తస్మిన్ కిం భూతే ఉపనతః ఉపస్థితో యోజనః విదురప్రేరితః ఖనకః తేన క్లృప్తో రచితః శ్లాఘ్యః ప్రశస్తో మార్గః భూమధ్యవర్త్మ యత్ర తస్మిన్. విదురో నాగరే ధీరే కౌరవాణాం చ మంత్రిణి, ఇతి **విశ్వః**. **మాలినీవృత్తమ్.** 80

**శ్లో॥ స్వయమేధితచిత్రభానుహేతిస్ఫురితాం తాం వసతిం విహాయ భూయః ।**
**స వనాన్తరముద్యతారిభీమస్స్వగురూద్భూతధురన్ధరః ప్రపేదే ॥ 81**

స్వయమితి. స రామః స్వయమేధిత ఉదితో యశ్చిత్రభానుః సూర్యః తస్య హేతిః తేజః తయా స్ఫురితాం ప్రకాశితాం; తామ్ అనంగవనరూపాం వసతిం స్థానం విహాయ పరిత్యజ్య భూయః పునర్వనాంతరం తతోఽన్యద్వనం ప్రపేదే ప్రాప్తవాన్; సూర్యే ఉదితే వనాంతరం జగామేత్యర్థః. యద్వా తాం వసతాం రాత్రిం విహాయ గమయిత్వా కిం భూతాం స్వయమిత్యాది సూర్యోదయాత్ కించిజ్జాతప్రకాశామిత్యర్థః. కిం భూతః ఉద్యతాః సంగ్రామే ఉద్యుక్తాః యే అరయః తేషాం భీమో భయంకరః తథా స్వగురుర్దశరథః తస్మాదుద్భూతామ్ ఉపస్థితాం ధురం భారం ధరతి ధారయతీతి తాదృశః. పక్షే సబలవత్త్వేన ప్రసిద్ధో భీమః స్వగురోః యుధిష్ఠిరస్య ఉద్భూతామ్ ఉత్పన్నాం ధురం గమనాశక్తాన్ ద్రౌపద్యాదీన్ గృహీత్వా శీఘ్రం గచ్ఛేత్యాది రూపం యుధిష్ఠిరేణార్పితం భారమిత్యర్థః. ధరతి నిర్వహతీతి తాదృశస్సన్ భూయోఽతిశయేన స్వయమేధితో వృద్ధిం గతః చిత్రభానుః పురోచనదత్తోఽగ్ని స్తస్య హేత్యా శిఖయా స్ఫురితాం ప్రజ్వలితాం వసతిం లాక్షాగృహం విహాయ శీఘ్రం పరిత్యజ్య ఖనక నిర్మిత వివరవర్త్మనా వనాంతరం వనమధ్యం ప్రపేదే జగామ; కిం భూతం వనాంతరమ్ ఉద్యతోఽరిః హిడింబరాక్షసో యత్ర తాదృశం; చిత్రభానుః పుమాన్ వైశ్వానరే చాహస్కరేపి చ, ఇతి **మేదినీ**. హేతిస్స్యాదాయుధే జ్వాలే హేతి స్తరణి తేజసి, ఇతి **విశ్వః**. వసతీ రాత్రీ వేశ్మనోః ఇతి చ. పూర్వోక్తం వృత్తమ్. 81

**శ్లో॥ విలఙ్ఘ్య గంగాం వ్రజతస్సుదూరమమ్లానదేహస్య బలానుభావాత్ ।**
**తస్యాగ్రతః సున్దరతోజ్జ్వలాఙ్గీ నిశాచరీ ప్రాదురభూన్మదాన్ధా ॥ 82**

విలంఘ్యేతి. గంగాం విలంఘ్య ఉత్తీర్య సుదూరం వ్రజతో గచ్ఛతస్తస్య రామస్య అగ్రతో నిశాచరీ తాటకాభిధానా రాక్షసీ ప్రాదురభూత్ ఆత్మానం దర్శయామాస; తస్య కిం భూతస్య బలా విశ్వామిత్రేణ దత్తా రక్షోఘ్నీ విద్యా తస్యా అనుభావాత్ సామర్థ్యాత్ అమ్లానో దేహో యస్య స తథా తస్య నిశాచరీ కిం భూతా సుందే సుందనామకేఽసురే రతా అనురక్తా తథా ఉజ్జ్వలమ్ ఉల్కయా ఊర్ధ్వం జ్వలత్ అంగం యస్యాస్సా ముఖేనోల్కాత్యాగం కుర్వతీత్యర్థః; తథా మదేన మత్తతయా గర్వేణ వా అంధా వివేకశూన్యా. పక్షే బలానుభావాత్ సామర్థ్యాతిశయాత్ అమ్లానదేహస్య తస్య భీమస్య అగ్రతః మదాంధా కామోన్మత్తా నిశాచరీ హిడింబీ నామ్నీ రాక్షసీ ప్రాదురభూత్; కిం భూతా సుందరతయా సౌందర్యేణ ఉజ్జ్వలమ్ అంగం యస్యాస్సా. అన్యత్సమానమ్. 82

**శ్లో॥ స్వవేగచకితోచ్చలత్ఖగమృగాహిడిమ్బావలీ**
**నిరన్తరతరోదరీ కృతకకర్మదక్షా క్షణాత్।**
**నిరీక్ష్య నృపనన్దనం ముఖరకౌశికే కాననే**
**దశాన్తరముపాగతం కిమపి కామచారోద్ధురమ్ ॥ 83**

స్వవేగేతి. ముఖరో వినాశయైనామితి వారం వారం కథనాద్వాచాలః కౌశికో విశ్వామిత్రో

యత్ర తాదృశే కాననే నృపనందనం రామం నిరీక్ష్య తాటకా కామచారేణ మునిషు యథేష్టాచరణేన ఉద్ధురమ్ ఉత్కటం కిమపి దశాంతరమ్ అవస్థాంతరమ్ అర్థాన్మరణం క్షణా- న్నిమేషార్ధేన ఉపాగమత్ ప్రాప్తవతీ; కిం భూతా స్వవేగేన చకితాః త్రస్తాః అత ఏవ ఉచ్చలంతః పలాయమానా యే ఖగాః పక్షిణో మృగా హరిణాదయః అహయః సర్పాశ్చ తేషాం డింబావళీ భయధ్వనయో యతస్సా తథా, నిరంతరమ్ అతిశయేనావధిశూన్యమ్ అతిదీర్ఘమిత్యర్థః. పరిధానశూన్యం వా ఉదరం యస్యాస్సా తథా, కృతకకర్మణి కపటకార్యే దక్షా నిపుణా. డింబో భయధ్వనావండే ఇతి, అంతరమవకాశావధి పరిధానాం, తర్ధిభేదతాదర్థ్యే ఇతి చ **మేదినీ**. పక్షే హిడింబా నామ నిశాచరీ ముఖరాః కౌశికాః పేచకాః యత్ర తాదృశే కాననే క్షణాత్ హర్షాత్ నృపనందనం భీమం నిరీక్ష్య కామచారేణ మదనోద్రేకేణ ఉద్ధురం ఉద్భూతం కిమపి వక్తుమశక్యం దశాంతరం వికారమ్ ఉపాగమత్; కిం భూతా స్వవేగేన చకితాః అత ఏవ ఉచ్చలంతః ఖగామృగాశ్చ యతస్తాదృశీ; తథా వళీభిస్త్రివళీభిః నిరంతరమ్ అతిశయేన వ్యాప్తమ్ ఉదరం యస్యాస్తాదృశీ; తథా కృతకకర్మదక్షా కృత్రిమకర్మనిపుణా; కౌశికో నకులే వ్యాళగ్రాహే గుగ్గులుశుక్రయోః । కోషజ్ఞోలూకయోశ్చ స్యాద్విశ్వామిత్ర- మునావపి, ఇతి **మేదినీ**. **పృథ్వీవృత్తమిదం** జసౌజసయలావసుగ్రహయతిశ్చ పృథ్వీగురురితి లక్షణాత్. 83

**శ్లో॥ విషమేషుప్రహారార్తాం తాం కృత్వాపతతో ద్రుతమ్ ।**
**స హి డిమ్బస్య శకలైరపుష్ణాత్పిశితాశినః ॥ 84**

విషమేష్వితి. స రామః ద్రుతం శీఘ్రం విశ్వామిత్రవచనానంతరమేవేత్యర్థః; తాం తాటకాం విషమః దుస్సహః యః ఇషుః బాణః తస్య ప్రహారేణ పాతనేన ఆర్తాం పీడితాం కృత్వా డింబస్య తస్యా విపాటితాదుదరాన్నిస్సృత్య కాలఖండస్య శకలైః ఖండైః కృత్వా పిశితాశినః మాంసాశినః పతతః పక్షిణో గృధ్రాదీన్ హి నిశ్చితమ్ అపుష్ణాత్ పుపోష; పతతో నిస్సరతో డింబస్యేతి వా. డింబః స్యాత్కాలఖండకే ఇతి **కోశః**. పక్షే స భీమః తాం హిడింబాం రాక్షసీం విషమేషుః కామః తస్య ప్రహారేణార్తాం కృత్వా స్వసౌందర్యదర్శనయా ఉద్దీపిత- మదనాం కృత్వా ద్రుతమాపతతః తథా విధాం భగినీం దృష్ట్వా క్రోధవశాద్వేగాదాగచ్ఛతో హిడింబస్య హిడింబాభ్రాతృరాక్షసవిశేషస్య శకలైః యుద్ధేన వినాశితస్య తస్య దేహఖండైః కృత్వా పిశితాశినో గృధ్రాదీన్ అపుష్ణాత్, పిశితాశినో రాక్షసస్య హిడింబస్య హి డింబస్య శకలైః కృత్వా పతతః పక్షిణో పుష్ణాదితి వా. భీమో హిడింబం జఘానేతి భావః. పతత్పత్త్రరథాండజాః, ఇతి, భిత్తం శకలఖండే వా ఇతి చ **అమరః**. 84

**శ్లో॥ ప్రతీపదర్శినీ సైషా విచచారాస్య యత్ పథి ।**
**తతో గురుగిరా తస్యా జీవితేశో బభూవ సః ॥ 85**

ప్రతీపేతి. సైషా తాటకా అస్య రామస్య పథి వర్త్మని యద్యస్మాత్ ప్రతీపదర్శినీ ప్రతికూల-

మాచరంతీ సతీ విచచార బభ్రామ, తతో హేతోర్గురోర్విశ్వామిత్రస్య గిరా వచసా స రామః తస్యాః తాటకాయా జీవితేశో యమో బభూవ, ప్రతికూలప్రవర్తినీం తాం విశ్వామిత్ర–స్యానుమత్యా జఘానేత్యర్థః. ఏతేన అవధ్యాం చ స్త్రియం ప్రాహుస్తిర్యగ్యోనిగతామపి ఇత్యాది స్మరణాత్ కథం రామః స్త్రియం తాటకాం హతవానితి తస్య జనాపవాదః పరిహృతః తస్యా ఆతతాయిత్వేన వధార్హత్వాద్గురువచనస్యావశ్యానుష్ఠేయత్వాచ్చ. పక్షే సైషా ప్రతీపదర్శినీ స్త్రీ హిడింబేత్యర్థః యద్యస్మాదస్య భీమస్య పథి పశ్చాద్వర్త్మని విచచార వారితాపి భీమమనుజగామేత్యర్థః. తతో హేతోః గురోః కుంత్యాః యుధిష్ఠిరస్య చ గిరా స భీమః తస్యా నితాంతమనురక్తత్వేన జ్ఞాతాయా హిడింబాయాః జీవితేశః స్వామీ బభూవ; హిడింబాం పరిణీతవానిత్యర్థః; ప్రతీపదర్శినీ వామా **ఇత్యమరః**. జీవితేశో యమే పుంసి త్రిషు స్యాజ్జీవితేశ్వరే ఇతి **మేదినీ**. 85

**శ్లో॥ వచనమాత్మగురోరనుతిష్ఠతా నృపసుతేన సమేత్య నిశాచరీ ।**
**అనుపతత్పిశితాశిఘటోత్కచా సమయయుక్తమపాయమవాప సా ॥86**

వచనమితి. సా నిశాచరీ రాక్షసీ తాటకా ఆత్మగురోర్విశ్వామిత్రస్య వచన మనుతిష్ఠతా పాలయతా నృపసుతేన రామేణ సహ సమేత్య మిళిత్వా సమయయుక్తం కాలప్రయుక్తమ్ అపాయం మరణమ్ అవాప; సమయయుక్తమితి రామరూపిణః కాలాదేవ మరణం ప్రాప; నతు సర్వభూతహితైషీ రామస్తామవధీదిత్యర్థః. కాలః పచతి భూతాని కాలస్సంహరతి ప్రజాః ఇత్యాది స్మరణాత్. సా కీదృశీ అనుపతన్తీ అభ్యాగచ్ఛంతీ పిశితాశినాం మాంసభోజన–శీలానాం గృధ్రాదీనాం ఘటా సమూహో యాం సా తథా, ఉగ్గతాః కచాః కేశా యస్యాస్సా రక్షసాం స్వభావాదూర్ధ్వకేశత్వాత్. పక్షే సా నిశాచరీ హిడింబా ఆత్మగురోః కుంత్యాయుధిష్ఠిరస్య చ వచనమనుతిష్ఠతా నృపసుతేన భీమేన సహ సమేత్య దాంపత్యేన సంగమ్య అనుపత–న్నుదరాన్నిస్సరన్ పిశితాశీ మాంసభక్షణశీలో ఘటోత్కచః తన్నామకః పుత్త్రో యస్యాస్తాదృశీ సతీ ప్రసూతఘటోత్కచనామక పుత్త్రా సతీత్యర్థః. సమయయుక్తం యదాహం స్మరిష్యామి తదాగంతవ్యమిత్యేవం వ్యవస్థా సమయః తద్యుక్తమ్ అపాయం విశ్లేషమ్ అవాప; భీమం పతిం ప్రాప్య కియంతం కాలం తేన సహ రమ్యకాననపర్వతాదౌ విహృత్య ఘటోత్కచ నామకం పుత్త్రం చ ప్రసూయ నిరుక్తవ్యవస్థాపూర్వకం వియోగం ప్రాప్తవతీత్యర్థః. **ద్రుతవిళంబితం వృత్తమ్**, ద్రుతవిళంబితమాహ నభౌభరౌ ఇతి లక్షణాత్. 86

**శ్లో॥ మహామునేః ప్రాప్తవతస్తపోవనం నరేన్ద్రసూనోరథ ధర్మజన్మనః ।**
**స్వభావనమ్రస్య పరాశరోద్భవప్రసాదలాభేన బభూవ నిర్వృతిః ॥87**

మహామునేరితి. అథ తాటకావధానంతరం మహామునేర్విశ్వామిత్రస్య తపోవనం ప్రాప్తవతో నరేంద్రసూనో రామస్య శరాణాం బాణానామ్ ఉద్భవః ప్రాప్తిః యస్మాత్ తాదృశో యః ప్రసాదస్తస్య లాభేన పరా శ్రేష్ఠా నిర్వృతిః సంతోషః బభూవ, తాటకావధసంతోషితా–

ద్విశ్వామిత్రాత్ పునరపి రక్షోఘ్నాన్ శరాన్ లబ్ధ్వా రామోతితరాం సుఖీ బభూవేత్యర్థః. కిం భూతస్య ధర్మజన్మనః ధర్మోత్పాదకస్య తథా స్వభావేన నమ్రస్య వినీతస్య. పక్షే అథ అనంతరం మహామునేశ్శాలిహోత్రస్య తపోవనం ప్రాప్తవతః ధర్మజన్మనో ధర్మోత్పన్నస్య స్వభావనమ్రస్య నరేంద్రసూనోః యుధిష్ఠిరస్య పరాశరోద్భవో వ్యాసః తస్య ప్రసాదలాభేన నిర్వృతిర్బభూవ. శాలిహోత్రాశ్రమే వ్యాససందర్శనం జాతమితి భావః. **వంశస్థవిలం** వృత్తమ్. 87

**శ్లో॥ తేనైవైకేన గురుణా స నిర్వృత్తప్రయోజనః ।**
**ఏకచక్రాహితగతిర్భాస్వానివ తథా బభౌ ॥ 88**

తేనేతి. స రామస్తదా తస్మిన్సమయే ఏకేనాద్వితీయేన తేనైవ విశ్వామిత్రేణైవ గురుణా నిర్వృత్తం సంపాదితమ్ అస్త్రశిక్షారూపం ప్రయోజనం కార్యం యస్య తాదృశస్సన్ భాస్వాన్సూర్య ఇవ బభౌ శుశుభే; సూర్యవదతితేజస్వీ జాత ఇత్యర్థః. కిం భూతః ఏకం ముఖ్యం యచ్చక్రం రాష్ట్రం మిథిలేత్యర్థః; తత్ర ఆహితా విశ్వామిత్రేణ నిశ్చితా గతిర్గమనం యస్య సః ఇతఃపరం రామం సీతాస్వయంవరే మిథిలాం గమయిష్యామీతి విశ్వామిత్రో నిశ్చితవానితి భావః. భాస్వానపి ఏకచక్రాహితగతిః ఏకచక్రయుక్తరథేన గమనవాన్భవతి. చక్రః కోకే పుమాన్క్లీబం వ్రజే సైన్యరథాంగయోః । రాష్ట్రే దంభాంతరే కుంభకారోపకరణాస్త్రయోః, ఇతి **మేదినీ**. పక్షే స యుధిష్ఠిరస్తదా ఏకచక్రే ఏకచక్రనామకనగరే ఆహితగతిః కృతగమనస్సన్ భాస్వానివ బభౌ; కిం భూతః ఏకేన తేనైవ గురుణా వ్యాసేన నిర్వృత్తం నిర్దిష్టం కథితమిత్యర్థః, ప్రయోజనం పాంచాలదేశే ద్రౌపదీస్వయంవరో భవిష్యతి భవద్భిస్తత్ర గంతవ్యమిత్యాదిరూపం యస్యసః **ఉపమేయం** శ్రౌతీ. 88

**శ్లో॥ తస్మిన్ప్రదేశే నృపసూనుసఙ్గాత్సనాథభావం సహసా ప్రపన్నే ।**
**క్రతుక్రియాసక్తధియాం మునీనాం రక్షో నిమిత్తం భయముద్దిదీపే ॥89**

తస్మిన్నితి. తస్మిన్ ప్రదేశే విశ్వామిత్రతపోవనభూమౌ నృపసూనుసంగాత్ రామ సంబంధాత్ సనాథభావం నాథసహితత్వం ప్రపన్నే ప్రాప్తే సతి క్రతుక్రియాయాం యజ్ఞకర్మణి ఆసక్తా ధీర్మతిః యేషాం తాదృశానాం మునీనాం రక్షోనిమిత్తం రాక్షసజన్యం భయం సహసా హఠాత్ ఉద్దిదీపే జాతమ్. తాటకావినాశాజ్జాతామర్షాః రాక్షసాః పునరపి మునీనాం యజ్ఞక్రియాం విఘాతయితుమారబ్ధవన్త ఇత్యర్థః. పక్షే తస్మిన్ ఏకచక్రాఖ్యే ప్రదేశే నృపసూను-సంగాత్ యుధిష్ఠిరసంబంధాత్ సనాథభావం ప్రపన్నే సతి మునీనాం రక్షోనిమిత్తం బకరాక్షస-జన్యం భయమ్ ఉద్దిదీపే, అన్యత్సమానమ్. 89

**శ్లో॥ రక్షోహితద్విజాయస్తదృష్టిమాత్రాభినోదితః ।**
**మరుదానన్దనో యత్నమాతస్థౌ నృపనన్దనః ॥ 90**

రక్ష ఇతి. మరుతో దేవానానందయతి యజ్ఞద్రుహో రాక్షసాన్ వినాశ్య సంతోషయతీతి

మరుదానందనః నృపనందనో రామః రాక్షసవధార్థం యత్నమ్ ఉద్యమమ్ ఆతస్థౌ కృతవాన్; కిం భూతః రక్షసామ్ అహితాః ద్వేష్టారో యే ద్విజాః ఋత్విజః తైః అయస్తాః రామం ప్రతి ప్రక్షిప్తాః యాః దృష్టయః చక్షూంషి తన్మాత్రేణ భయాకులత్వాత్ నతు వచసా అభినోదితః ప్రేరితః. పక్షే మరుదానందనో నృపనందనో భీమః రక్షసో బకస్య హితః తద్దినభోజ్యత్వాత్ పథ్యో యో ద్విజో బ్రాహ్మణస్తత్ర ఆయస్తా కారుణ్యాత్ ప్రక్షిప్తా దృష్టిర్యత్ర క్రియాయాం తద్యథా తథా మాత్రా కుంత్యా అభినోదితః ప్రేరితస్సన్ బకస్య వినాశాయ యత్నమాతస్థౌ రాక్షసభక్షణభీతం బ్రాహ్మణం దృష్ట్వా సంజాతదయా కుంత్యా నియుక్తో భీమో బకరాక్షసం వినాశయితుం భోజ్యసహితః తద్గృహమగాదిత్యర్థః. మరుద్దేవే సమీరే నా గ్రంథిపర్ణే నపుంసకమ్ ఇతి **మేదినీ.** 90

**శ్లో॥ మారీచేష్టమనిష్టకారిణమసౌ సిద్ధాశ్రమస్థాయినాం**
**విప్రాణామభయార్థమధ్వరవిధేర్గోప్తా గురోరాజ్ఞయా ।**
**సద్యః సానుచరం నిశాచరపతిం భీమః సుబాహుం రణే**
**దోర్వీర్యేణ జఘాన వీరపదవీమారుహ్య ఘోరాంబకమ్ ॥ 91**

మారీచేష్టమితి. అధ్వరవిధేర్యజ్ఞక్రియాయాః గోప్తా రక్షితా అసౌ రామః విప్రాణామ్ అభయార్థమ్ అభయదానాయ గురోర్విశ్వామిత్రస్య ఆజ్ఞయా రణే యుద్ధే దోర్వీర్యేణ స్వబాహుబలేనైవ సద్యః తత్క్షణాత్ సానుచరం ససైన్యం సుబాహుం సుబాహునామానం నిశాచరపతిం రాక్షసశ్రేష్ఠం జఘాన; కిం భూతః స్వభావతః శాన్తమూర్తిరపి వీరపదవీం వీరమార్గమ్ ఆరుహ్య ప్రాప్య భీమః భయంకరః నిశాచరపతిం కిం భూతం మారీచస్య మారీచనామకస్య రాక్షసస్య ఇష్టం భ్రాతృత్వాత్ప్రియం తథా సిద్ధాశ్రమస్థాయినాం తపోవనవాసినాం మునీనామ్ అనిష్టకారిణమ్ అపకారకం తథా ఘోరే భయంకరే అంబకే చక్షుషీ యస్య స తథా తమ్. దైవదీపస్తు లోచనమ్ అంబకమ్, ఇతి **పురుషోత్తమః.** పక్షే అసౌ భీమో భీమసేనః గురోః కుంత్యా ఆజ్ఞయా రణే ఘోరాం భయానకాం వీరపదవీమారుహ్య దోర్వీర్యేణ బాహుబలేనైవ నతు బాణాదినా బకం బకనామకం నిశాచరపతిం సద్యో జఘాన; కిం భూతం మారీజనక్షయస్తత్ర చేష్టా యస్య స తథా తమ్. తథా సానుషు పర్వతగుహాసు చరతీతి సానుచరః తం తథా సుబాహుం దీర్ఘభుజమ్, అన్యత్సమానమ్. మారీ చండ్యాం జనక్షయే ఇతి **మేదినీ. శార్దూలవిక్రీడితం** వృత్తమ్. 91

**శ్లో॥ భూచరద్విజగణాశనం ద్విషం ఖేచరద్విజగణాశనం తదా ।**
**తం విధాయ కులమగ్రజన్మనాం రాక్షసక్షయకరో రరక్ష సః ॥ 92**

భూచరేతి. స రామః భువి పృథివ్యాం చరంతీతి భూచరాః యే ద్విజగణాః బ్రాహ్మణగణా స్తానశ్నాతీతి తాదృశం ద్విషం శత్రుం తం సుబాహుం ఖేచరా అంతరిక్షచారిణో యే ద్విజగణాః పక్షిగణాః తేషామశనం భక్ష్యం, విధాయ కృత్వా అగ్రజన్మనాం బ్రాహ్మణానాం కులం

సమూహం రరక్ష రక్షితవాన్, కిం భూతః రాక్షసానాం క్షయం నాశం కరోతీతి తాదృశః. పక్షే తం బకం కులం వంశం స భీమః అన్వత్సమానమ్. దంతవిప్రాండజా ద్విజా **ఇత్యమరః. రథోద్ధతావృత్తమిదం** రాన్నరావిహ రథోద్ధతా లగావితి లక్షణాత్. 92

**శ్లో॥ ద్విజరాజగవీభిస్స వర్ధితశ్రీర్నృపాత్మజః ।**
**జగదానన్దయన్ సాక్షాత్కామదేవ ఇవాబభౌ ॥ 93**

ద్విజేతి. ద్విజరాజగవీభిః బ్రాహ్మణశ్రేష్ఠానాం వచనైః వర్ధితా శ్రీః యస్య తాదృశః స నృపాత్మజో రామః, పక్షే భీమశ్చ జగత్ భువనమ్ ఆనందయన్ రాక్షసవినాశాత్సన్తోషయన్సన్ సాక్షాత్కామదేవ ఇవ కందర్ప ఇవ ఆబభౌ శుశుభే; కామదేవోపి ద్విజరాజగవీభిశ్చంద్రకిరణైః వర్ధితశ్రీః భవతి; జగచ్చానందయతి. అథ చ కామదేవ ఏతద్గ్రంథకారయితా నృపతివిశేషః. ఉపమానతయా తస్యాప్యుల్లేఖః కృతః సోఽపి బ్రాహ్మణవచనైర్వర్ధితశ్రీః జగచ్చానందయతి; ఏవముత్తరత్రాపి సర్గాణాం సమాప్తౌ శ్లిష్టతయా కామదేవ శబ్దేన తస్యైవోట్టంకనం కరిష్యతి. ద్విజరాజగవీతి **గౌరతద్ధితలుకీతి రాజాదిత్వాట్టః**. క్వచిత్ స ఇత్యత్ర **సమితి పాఠః** సతు న సమ్యక్ యతిభంగదోషాత్. **ఉపమేయం శ్రౌతీ.** 93

**ఇతి శ్రీప్రేమచంద్రతర్కవాగీశభట్టాచార్యవిరచితాయాం**
**కపాటవిపాటికాఖ్యాయాం రాఘవపాండవీయమహాకావ్యటీకాయాం ప్రథమస్సర్గః.**





శ్రీః

శ్రీ పరంబ్రహ్మణే నమః ।

# రాఘవపాణ్డవీయే

## ద్వితీయః సర్గః ।

**శ్లో॥ నృపేణ కన్యాం జనకేన దిత్సితామయోనిజాం లమ్భయితుం స్వయంవరే ।**
**ద్విజప్రకర్షేణ స ధర్మనన్దనస్సహానుజస్తాం భువమప్యనీయత ॥ 1**

అథ సీతాద్రౌపద్యోర్వివాహం వర్ణయితుం ద్వితీయసర్గమారభతే, నృపేణేతి. జనకేన జనకనామ్నా నృపేణ స్వయంవరే దిత్సితాం దాతుమిష్టామ్ అయోనిజాం భూమేరుద్భూతాం కన్యాం సీతానామ్నీం లంభయితుం ప్రాపయితుం, ద్విజేషు ప్రకర్షః ఉత్కృష్టతా యస్య స తథా తేన విశ్వామిత్రేణేత్యర్థః, సహానుజో లక్ష్మణేన సహితో ధర్మనందనో రామః తాం తదీయాం జనకసంబంధినీం భువమపి మిథిలామపి అనీయత ప్రాపితః; న కేవలం స్వకార్యసిద్ధ్యర్థం స్వాశ్రమం నీతః కింతు సీతాం గ్రాహయితుం మిథిలామపి నీత ఇత్యపేరర్థః; సీతాస్వయంవరే జనకేన నిమంత్రితః విశ్వామిత్రః తాం రామాయ దాపయితుం రామ-లక్ష్మణాభ్యాం సహ మిథిలాం గతవానిత్యర్థః. ధర్మనందన ఇతి ధర్మం నందయతి ధర్మద్రుహాం రక్షసాం వినాశాద్వర్ధయతీతి సః; యద్వా ధర్మేణ ధర్మసంస్థాపనేన మునీన్ నందయతీతి తాదృశః. పక్షే జనకేన కన్యాయాః పిత్రా ద్రుపదేన స్వయంవరే దిత్సితామ్ అయోనిజాం యజ్ఞవేదిసంభూతాం కన్యాం ద్రౌపదీం లంభయితుం ద్విజప్రకర్షేణ వ్యాసేన సహానుజో భీమార్జునాది సహితః స ధర్మనందనో ధర్మాత్మజో యుధిష్ఠిరస్తాం ద్రుపద- సంబంధినీం భువం పంచాలదేశమ్ అపి నిశ్చితమ్ అనీయత వ్యాసవచనాత్ ద్రౌపదీస్వయంవరే పంచాలదేశం గతవానిత్యర్థః. స్వయంవర ఇతి స్వయమ్ ఆత్మనా పతిః వ్రియతేఽస్మిన్నితి **అధికరణేఽచః**, జనకః పితృభూభుజోః ఇతి **మేదినీ. వంశస్థవిలం వృత్తమ్.** 1

**శ్లో॥ మార్గేష్వథో దీర్ఘతమస్సుతస్య కళత్రకృచ్ఛ్రప్రతిమోక్షణేన ।**
**అఙ్గారవర్ణస్య జితాత్మనోఽసౌ చకార తోషం నరదేవజన్మా ॥ 2**

మార్గేష్వితి. అథో అనంతరమ్ అసౌ నరదేవజన్మా రామః మార్గేషు పథిషు దీర్ఘతమా మునివిశేషస్తస్య సుతస్య గోతమస్య కళత్రకృచ్ఛ్రప్రతిమోక్షణేన కళత్రం పత్నీ అహల్యేత్యర్థః తస్య యత్ కృచ్ఛ్రం పాషాణభావేనావస్థానరూపం కష్టం తస్య ప్రతిమోక్షణేన మోచనేన, తోషం హర్షం చకార, అహల్యాం శాపముక్తాం కృత్వా గోతమం సంతోషయామాసేత్యర్థః.

కిం భూతస్య అంగారవర్ణస్య తేజస్విత్వాత్ జ్వలదంగారప్రతిమరూపస్య తథా జితాత్మనః జితేంద్రియస్య. పక్షే అసౌ నరదేవజన్మా అర్జునః దీర్ఘతమస్సుదీర్ఘాణి నిబిడాని తమాంసి అంధకారా యత్ర తాదృశేషు మార్గేషు గంగాసమీపవర్త్మసు జితః ఆగ్నేయాస్త్రేణాధీనీకృతః ఆత్మా శరీరం యస్య తాదృశస్య తస్య అతిప్రసిద్ధస్య అంగారవర్ణస్య అంగారవర్ణనామకస్య చిత్రరథాపరనామక గంధర్వస్య కళత్రాత్ తత్పత్నీ కృతవినయాద్ధేతోః కృచ్ఛ్రాద్వధరూపాత్ కష్టాత్ యత్ ప్రతిమోక్షణం తేన తోషం చకార. అయమర్థః రాత్రౌ గంగాసమీపే గచ్ఛత్సు పాండవేషు స్త్రీభిస్సార్ధం క్రీడతా అంగారవర్ణగంధర్వేణ తిరస్కృత్యార్జునం ప్రతి బాణః ప్రక్షిప్తః, అర్జునస్తు ఉల్ముకేన తం బాణం నివార్య ఆగ్నేయాస్త్రేణ తద్రథం భస్మీకృత్య చ గృహీత్వా యదా తం వినాశయితుముద్యతః తదానీం తత్పత్నీ పత్యుర్మోక్షణార్థమతివినయం కృతవతీ. తచ్ఛ్రుత్వాచార్జునస్తం ముమోచేతి భారతవార్తా; అంగారవర్ణేత్యత్ర అంగారపర్ణేతి బహుషు ప్రామాణిక భారతపుస్తకేషు పాఠో దృశ్యతే; అత్రాపి యది స ఏవ స్యాత్తదా రామాయణపక్షే అంగస్య దేహస్య ఆరో ధారణం యేభ్యస్తాదృశాని పర్ణాని పత్రాణి యస్య తథా తస్య గళత్పర్ణాని భుక్త్వా శరీరం ధారయత ఇత్యర్థః ఇతి వ్యాఖ్యేయమ్. ఇంద్రవజ్రోపేంద్రవజ్రయో-**రుపజాతిర్వృత్తమ్.** 2

**శ్లో॥ సార్ధం ద్విజైః సంవృతధామ్ని జిష్ణావుపేయుషి ఖ్యాతకకుత్థ్సవంశ్యే ।**
**నయజ్ఞసేనస్య నయోపపన్నా రాజ్ఞః పురీ భూపతిభిః పుపూరే ॥ 3**

సార్ధమితి. జిష్ణౌ జయశీలే ఖ్యాతకకుత్థ్సవంశ్యే ఖ్యాతోఽతిప్రసిద్ధో యః కకుత్థ్సస్య నృపవిశేషస్య వంశోఽన్వవాయస్తత్ర భవే రామే ద్విజైః విశ్వామిత్రాదిభిస్సార్ధమ్ ఉపేయుషి మిథిలాం ప్రాప్తే సతి నయజ్ఞానీతి కుశలా సేనా యస్య తాదృశస్య రాజ్ఞో జనకస్య నయోపపన్నా నీతివిలసితా పురీ నగరీ భూపతిభిః సీతావివాహార్థం నిమంత్రితైః రాజభిః పుపూరే వ్యాప్తా. కిం భూతే సంవృతం ప్రతిచ్ఛన్నం ధామ ప్రభావో యస్య తస్మిన్, యద్యపి రామాయణే నృపాణామాగమనం నవర్ణితం తథాపి **నరసింహపురాణాదౌ** వర్ణితమితి నానుపపత్తిః; **యథా నానాదేశాదథాయాతా జనకస్య నివేశనమ్ । రాజపుత్రా మహావీర్యాః పూర్వం సీతాభికాంక్షిణః,** ఇత్యాది. పక్షే సంవృతధామ్ని బ్రాహ్మణవేషధారిత్వాత్ అప్రకటిత-క్షాత్రతేజసి జిష్ణౌ అర్జునే ద్విజైః బ్రాహ్మణైస్సార్ధమ్ ఉపేయుషి సతి యజ్ఞసేనస్య ద్రుపదస్య రాజ్ఞో నయోపపన్నా పురీ భూపతిభిర్న పుపూరే అపి తు పుపూర ఏవేతి కాకుః. కిం భూతే ఖ్యాతకకుత్థ్సవంశ్యే కకుదః కళంకస్య స్థా స్థితిర్యత్ర స తథా కకుత్థ్సః చంద్రః ఖ్యాతో యః కకుత్థ్సవంశః తత్ర భవే చంద్రవంశజే ఇత్యర్థః. జిష్ణావిత్యుపలక్షణం యుధిష్ఠిరాదీనామపి ద్రుపదపురీగమనస్య భారతే వర్ణనాత్. అర్జునః ఫాల్గునో జిష్ణుః ఇతి **పురుషోత్తమః.** కకుత్స్యాన్మఖ్యచిహ్నయోః ఇతి **కోశః.** 3

**శ్లో॥ ఆలోలచామరమరాళచితాన్తరాళైశ్ఛత్రోత్కరైః స్తబకితా పృథివీశ్వరాణామ్ ।**
**నానాదిగంతరజుషాం కమలాకరాణామేకాలయత్వమివ సా నగరీ జగామ॥ 4**

ఆలోలేతి. సా నగరీ జనకపురీ పక్షే ద్రుపదపురీ పృథివీశ్వరాణాం రాజ్ఞాం ఛత్రోత్కరై-రాతపత్రసమూహైః స్తబకితా సతీ శ్వేతత్వాత్పుండరీకబృందస్వరూపైశ్ఛత్రైర్వ్యాప్తా సతీత్యర్థః నానాదిగంతరజుషాం నానాదేశస్థితానాం కమలాకరాణాం పద్మాకరాణామ్ ఏకాలయత్వమ్ ఏకాధారత్వమివ జగామ ప్రాప్తవతీ; సైషా శ్వేతచ్ఛత్రసమూహవ్యాప్తా నగరీ కింతు సర్వే పద్మాకరాః కిమేకత్రాస్యాం నగర్యాం పుంజీభూతా ఇతి తాత్కాలికాః సంభావయామాసురిత్యర్థః. కిం భూతైః ఛత్రోత్కరైః ఆలోలాని చంచలీక్రియమాణాని యాని చామరాణి వాలవ్యజనాని తాన్యేవ మరాళాః రాజహంసాః తైః చితాని వ్యాప్తాని అంతరాళాని మధ్యాని యేషాం తైః రాజహంసా అపి పద్మానాం మధ్యే అవతిష్ఠంతే; నానాదిగంతరజుషామితి, **కాకాక్షి గోళక-న్యాయాత్** పృథివీశ్వరాణామపి విశేషణమ్; పృథివీశ్వరా అపి కమలాకరాః లక్ష్మ్యా ఆకరాః ఆశ్రయా భవంతి; అత్ర ఛత్రోత్కరాణాం పుండరీకోత్కరత్వారోపస్యార్థత్వాదేకదేశ **వివర్తిరూపకం**, తదనుప్రాణితా చ ఏకాలయత్వమివేత్య**త్రోత్ప్రేక్షా**, తేన చాత్రరూపకోత్ప్రేక్షయో-రంగాంగి భావః **సంకరః**. **వసంతతిలకం వృత్తమ్.** 4

**శ్లో॥ సద్యో మృష్టాభరణకిరణైః పూరయన్తో దిగన్తా-**
**న్వీర్యోత్కర్షాదహమహమికాం భూభృతో దర్శయన్తః ।**
**వైన్ధ్యం వైన్ధ్యాస్తరవ ఇవ తే పుష్పితాస్సానుభాగం**
**క్షత్రాయత్తే విహితరతయః శోభయన్తి స్మ రఙ్గమ్ ॥ 5**

సద్య ఇతి. తే భూభృతో రాజానో, రంగం స్వయంవరసమాజం శోభయంతి స్మ, కిం భూతాః సద్యః తత్కాలం మృష్టాని సంస్కృతాని యాని ఆభరణాని అలంకారాస్తేషాం కిరణైః దీప్తిభిః, దిగంతాన్ దిగ్భాగాన్ పూరయంతః ప్రకాశయంతః తథా వీర్యస్య బలస్య ఉత్కర్షాదాధిక్యాత్ అహమహమికాం పరస్పరమహంకారం దర్శయంతః ప్రకటయంతః తథా క్షత్రాయత్తే క్షత్రియసాధ్యే కర్మణి ఏకత్ర హరధనుర్భంగే అన్యత్ర లక్ష్యవేధే విహితా రతిః అనురాగో యైస్తాదృశాః ఉపమినోతి, పుష్పితాః సంజాతకుసుమాః వైంధ్యాః వింధ్యపర్వ-తోత్పన్నాః తరవో వృక్షాః వైంధ్యం వింధ్యసంబంధినం సానుభాగం ప్రస్థప్రదేశమివ యథా పుష్పితా వైంధ్యాస్తరవో వైంధ్యం సానుభాగం శోభయంతి తథేత్యర్థః. **ఉపమేయం శ్రౌతీ;** అహమహమికా తు సా స్యాత్పరస్పరం యో భవత్యహంకారః **ఇత్యమరః. మందాక్రాంతా-**వృత్తమిదమ్. 5

**శ్లో॥ అథానురూపేణ జనేన గుప్తా మనోజ్ఞవేషా మనుజేన్ద్రకన్యా ।**
**ఉపాయయౌ లోచనవర్త్మ రాజ్ఞామాజ్ఞేవ మూర్తా మకరధ్వజస్య ॥ 6**

అథేతి. అథ రాజ్ఞాం సభాప్రవేశానంతరం మనుజేంద్రకన్యా సీతా, పక్షే ద్రౌపదీ చ రాజ్ఞాం లోచనవర్త్మ నయనపదమ్, ఉపాయయౌ గతవతీ సా తైః దృష్టేత్యర్థః; కిం భూతా అనురూపేణ యోగ్యేన, జనేన కంచుకిప్రభృతినా, గుప్తా రక్షితా, తథా మనోజ్ఞో రమణీ

యః వేషో యస్యాః సా, తథా మకరధ్వజస్య కామస్య మూర్తా మూర్తిమతీ ఆజ్ఞేవ యూనాం వశీకరణీ అనుమతిరివ సౌందర్యేణ వశీకృతరాజసమూహేత్యర్థః, **ఉత్ప్రేక్షేయమ్**. 6

**శ్లో॥ సా తత్ర యానాదవతీర్య తన్వీ సౌదామినీవామ్బుదరాజిమధ్యాత్ ।**
**సమీపమాప స్వపణీకృతస్య చాపస్య పుష్పాయుధచాపయష్టిః ॥ 7**

సేతి. సా తన్వీ క్షీణాంగీ సీతా ద్రౌపదీ చ తత్ర రంగే యానాత్ శిబికాయా అవతీర్య అవరుహ్య స్వపణీకృతస్య స్వస్యా వివాహాయ శుల్కీకృతస్య చాపస్య హరధనుషః, పక్షే లక్ష్యవేధార్థం స్థాపితస్య ధనుషః సమీపమ్ ఆప ప్రాప్తవతీ; కిం భూతా పుష్పాయుధస్య కామస్య చాపయష్టిః ధనుర్దండరూపా అతితరాం కామోద్దీపికేత్యర్థః; కేన అంబుజరాజిమధ్యాత్ మేఘపఙ్క్తిమధ్యాత్ సౌదామినీవ విద్యుదివ యథా అంబుజరాజిమధ్యాదవతీర్య బహిర్నిర్గత్య సౌదామినీ శోభతే తథేత్యర్థః; అత్ర సౌదామినీవేత్యుపమాయాః పుష్పాయుధచాపయష్టిరితి రూపకస్య చ పరస్పరమనపేక్ష్య స్థితత్వాదుపమారూపకయోస్సంసృష్టిరలంకారః మిథోఽనపేక్షయైవైషాం స్థితిస్సంసృష్టిరుచ్యతే ఇతి లక్షణాత్. 7

**శ్లో॥ శక్తిర్మూర్తిమయీ స్మరస్య జగతో నారీమయమ్మణ్డనం**
**కాన్తానాముపమానకల్పనకలాకాన్తేస్సముత్తేజనమ్ ।**
**లక్ష్మీః సంసృతిసాగరస్య సరసీ లావణ్యపుణ్యామ్బసాం**
**సా రాజవ్రజచక్షుషాం క్షణమభూదానందపణ్యస్థలీ ॥ 8**

శక్తిరితి. సా సీతా, పక్షే ద్రౌపదీ చ రాజవ్రజస్య రాజసమూహస్య చక్షుషామ్, ఆనందస్య ఆహ్లాదస్య పణ్యస్థలీ క్రయస్థానమభూత్; ఆనంద ఏవ పణ్యం క్రేయం వస్తు తస్య స్థలీతి వా; తాం దృష్ట్వా రాజానః ఆనందమగ్నా బభూవురిత్యర్థః. కిం భూతా స్మరస్య కామస్య మూర్తిమయీ గృహీతవిగ్రహా, శక్తిరస్త్రవిశేషరూపా సామర్థ్యస్వరూపా వా, అతితరాం కామోద్దీపికేత్యర్థః; తథా జగతో లోకస్య నారీమయం స్త్రీరూపం మండనమలంకారః యయా నార్యా జగదలంకృతమిత్యర్థః; తథా కాంతానాం స్త్రీణాముపమానకల్పనస్య సామ్య-ప్రతిపాదనస్య కలా శిల్పమ్ అతిసౌందర్యాత్ స్త్రీణామ్ ఉపమానభూతేత్యర్థః. తథా కాంతేః శోభాయాః సముత్తేజనం ప్రకాశికా తథా సంసృతిః సంసార ఏవ సాగరస్సముద్రస్తస్య లక్ష్మీః శ్రీరివ అన్యాపి లక్ష్మీః సముద్రోత్పన్నా తథా లావణ్యపుణ్యాంభసాం లావణ్యరూప-పవిత్రజలానాం సరసీ సరోవరమివ అతిలావణ్యవతీత్యర్థః; అత్ర బహూనాం రూపకాణాం సద్భావాన్నిరంగమాలారూపకమ్. కలా స్యాన్మూలవివృద్ధౌ శిల్పాదావంశమాత్రకే, ఇతి **మేదినీ**. **శార్దూలవిక్రీడితం వృత్తమ్**. 8

**శ్లో॥ సౌన్దర్యశ్రీపతాకా నిఖిలయువమనఃశృఙ్ఖలా లోకచక్షుః-**
**పక్ష్మస్పన్దవ్యుదాసః సురమునిహృదయాకర్షణే కామపాశః ।**

**తారుణ్యోద్యానవల్లీ పతిసుకృతకలా కామకోదణ్డమౌర్వీ**
**రేజే తద్దోర్లతాగ్రే వరవరణవిధౌ కల్పితా పుష్పమాలా ॥ 9**

సౌందర్యేతి. వరస్య జామాతుః వరణవిధౌ వరణవిధానాయ, కల్పితా రచితా తస్యాః సీతాయాః, పక్షే ద్రౌపద్యాశ్చ దోర్లతాయాః భుజవల్ల్యాః అగ్రే స్థితా పుష్పమాలా రేజే శుశుభే; కిం భూతా సౌందర్యశ్రియః సౌందర్యలక్ష్మ్యాః పతాకా వైజయంతీవ తస్యాః సౌందర్యాతిశయం వ్యంజయతీత్యర్థః. తథా నిఖిలానాం సర్వేషాం యూనాం మనసః, శృంఖలా బంధనరజ్జురివ తథా లోకచక్షుషాం పక్ష్మణాం స్పందస్య నిమేషస్య వ్యుదాసో నిరాకరణం తద్ధేతురిత్యర్థః; తథా సురాణాం మునీనాం చ హృదయాకర్షణే కామపాశః కామస్యాస్త్రవిశేష ఇవ తథా తారుణ్యం యౌవనమేవ ఉద్యానమ్ ఉపవనం తస్య వల్లీలతేవ తథా పత్యుః భవిష్యతః స్వామినః సుకృతస్య పుణ్యస్య కలామూలధనరూపస్య సుకృతస్య వృద్ధిరూపేత్యర్థః తథా కామకోదండస్య కందర్పధనుషః మౌర్వీ జ్యేవ; అత్ర లోకచక్షుః-పక్ష్మస్పందవ్యుదాస ఇత్యత్ర **హేత్వలంకారః**; అన్యత్ర తు **నిరంగమాలారూపకమిత్యనయో**-స్సంసృష్టిః. **స్రగ్ధరావృత్తమ్.** 9

**శ్లో॥ సా దుగ్ధసిన్ధోరుదితైవ లక్ష్మీర్లావణ్యమస్యా నియతం సుధైవ ।**
**యదేతదాపీయ దృశా ప్రపేదే మనుష్యలోకోఽప్యనిమేషభావమ్ ॥10**

సేతి. సా సీతా పక్షే ద్రౌపదీ చ దుగ్ధసింధోః క్షీరసముద్రాదుదితా ఉత్థితా లక్ష్మీరేవ తథాస్యా లావణ్యం శరీరసౌందర్యం నియతం నిశ్చితం సుధైవ అమృతమేవ; కథమేతద్ జ్ఞాతమిత్యాహ యద్యస్మాత్ ఏతల్లావణ్యం దృశా చక్షుషా ఆపీయ సాభిలాషం దృష్ట్వా అథ చ పీత్వా దేవవత్ మనుష్యలోకోఽపి అనిమేషభావం నిమేషశూన్యత్వం ప్రపేదే ప్రాప్తవాన్; దేవానాం హి సుధాపానాదేవానిమేషత్వం న తు స్వభావాత్, అతః సుధారూపం లావణ్యం పిబతో మనుష్యలోకస్యాపి తద్యుజ్యత ఇత్యర్థః. అత్రోత్ప్రేక్షాపరిపుష్టేన అనుమానాలంకారేణ అతిసుందరీయమితి వస్తు ధ్వన్యతే. 10

**శ్లో॥ రాజ్ఞాం మనోదర్పణమణ్డలేషు ప్రత్యేకమేకా యుగపత్ స్ఫురన్తీ ।**
**రరాజ బాలా కుముదాకరేషు రేఖా హిమాంశోః ప్రతిబిమ్బితేవ ॥11**

రాజ్ఞామితి. ఏకా బాలా సీతా, పక్షే ద్రౌపదీ చ, ప్రత్యేకం రాజ్ఞాం మనోదర్పణమండలేషు స్వచ్ఛత్వాత్ మనాంసి దర్పణమండలానీవ ఆదర్శతలానీవేతి తేషు యుగపదేకదైవ స్ఫురంతీ విలసంతీ సతీ రరాజ; ఉపమినోతి కుముదాకరేషు ప్రతిబింబితా ప్రతిబింబత్వేన స్ఫురంతీ హిమాంశోశ్చంద్రస్య రేఖేవ చంద్రరేఖా యథా ఏకాపి సర్వత్ర కుముదాకరేషు యుగప-త్ప్రతిబింబితా రాజతే తథేత్యర్థః; అతిసౌందర్యాద్రాజ్ఞాం మనో జహారేత్యర్థః. మనోదర్పణ మండలేష్వితి వ్యాఘ్రాద్యైస్తద్గుణస్తుత్యస్యేత్యనేన **ఉపమాసమాసః. ఉపమాలంకారః.** 11

**శ్లో॥ పుష్పైర్విచిత్రైర్గ్రథితో విరేజే తస్యా ఘనః కుఞ్చితకేశపాశః ।**
**తద్వక్త్రపద్మోత్తమగన్ధలోభాత్సాన్ద్రీభవద్భృఙ్గపరంపరేవ ॥ 12**

పుష్పైరితి. తస్యాస్సీతాయాః, పక్షే ద్రౌపద్యాశ్చ ఘనో నిబిడః కుంచితః స్వభావాద్భంగురః జుటికా రూపో వా కేశపాశః కేశకలాపః, తద్వక్త్రపద్మోత్తమగంధలోభాత్ తస్యాస్సీతాయా, ద్రౌపద్యాశ్చ వక్త్రపద్మస్య ముఖకమలస్య య ఉత్తమగంధః అతిసౌరభ్యం తస్య లోభాద్ధేతోః సాంద్రీభవంతీ నిబిడతయా మిళంతీ భృంగపరంపరేవ భ్రమరపఙ్క్తిరివ విరేజే; నాయం-కేశపాశః కింతు ముఖసౌరభ్యలోభాత్ పశ్చాన్మిళితా భ్రమరావళిరివే**త్యుత్ప్రేక్షా**. కిం భూతః విచిత్రైః నానావిధైః పుష్పైర్గ్రథితః సంబద్ధః ఇదం స్వరూపవర్ణనమాత్రం నతూత్ప్రేక్షాయాః ప్రయోజకం; పాశః పక్షశ్చ హస్తశ్చ కలాపార్థాః కచాత్పరే, **ఇత్యమరః**. 12

**శ్లో॥ వక్త్రస్య తస్యాః ప్రసమీక్ష్య శోభాం తారాపతిర్మణ్డలమాప భానోః ।**
**తథాపి నో సామ్యముపైతి తస్మాత్తప్తుం తపః ప్రాప పురారిమౌలిమ్ ॥13**

వక్త్రస్యేతి. తారాపతిశ్చంద్రః తస్యాః సీతాయాః, పక్షే ద్రౌపద్యాశ్చ, వక్త్రస్య ముఖస్య, శోభాం స్వస్మాదుత్కృష్టం సౌందర్యం ప్రసమీక్ష్య దృష్ట్వేవేతి ప్రతీయమానోత్ప్రేక్షా భానోః సూర్యస్య మండలం ప్రాప తాదృశశోభాప్రాప్త్యర్థం తపస్తప్తుమితిశేషః, అమావస్యాయామ్ సూర్యాచంద్రమసోరేకరాశావవస్థానాదియముత్ప్రేక్షా; తథాపి భానుమండలప్రవేశేపి సామ్యం ఏతన్ముఖసాదృశ్యం నో ఉపైతి న ప్రాప్తవాన్; తస్మాత్ సామ్యాలాభాది తపస్తప్తుం తపసా అధికతరం పుణ్యముపార్జయితుం పురారేశ్శివస్య మౌళిం మూర్ధానం ప్రాప, అన్యోఽపి ఏకత్ర తీర్థాదౌ తపసా స్వాభీష్టమప్రాప్య తతోఽప్యుత్కృష్టం తీర్థాంతరమాశ్రయతి; ఏతేనాస్యా ముఖమతితరాం మనోజ్ఞమితి భావః. అత్రాభిధేయస్య సంభావ్యమానత్వాదివాదిపదా ప్రయోగాచ్చ ప్రతీయమానోత్ప్రేక్షేయమ్. **ఏష్వింద్రవజ్రావృత్తమ్.** 13

**శ్లో॥ ఏతస్యా నేత్రశోభాం తులయతి న యదా ఖఞ్జనః ప్రాప్తకీర్తి-**
**ర్నూనం వాతాపిహన్తుర్వ్రజతి పదమితో యోగయుక్తస్తపస్వీ ।**
**తద్వన్నీలోత్పలేన ప్రతిదివసమతో మగ్నమప్సు ప్రవిష్టాః**
**కాన్తారం తద్వదేణ్యః ప్రథితమిహ యతో నాస్త్యలభ్యం తపోభిః ॥ 14**

ఏతస్యా ఇతి. ప్రాప్తకీర్తిః సౌందర్యేణ లబ్ధప్రతిష్ఠోపి ఖంజనః పక్షివిశేషః ఏతస్యాః సీతాయాః పక్షే ద్రౌపద్యాశ్చ నేత్రశోభాం చక్షుస్సౌందర్యం యదా న తులయతి న సదృశీకరోతి; నూనమ్ ఉత్ప్రేక్షే తదా యోగయుక్తో యోగీతపస్వీ చ భూత్వా. ఇతోఽస్మద్దేశాత్ వాతాపి-హంతురగస్త్యస్య పదమాశ్రమం దక్షిణదిశమిత్యర్థః. వ్రజతి ఏతన్నేత్రశోభా ప్రాప్త్యర్థం తపః కర్తుమివ దక్షిణదిశం గచ్ఛతీత్యర్థః వర్షాసు ఖంజనానాం దక్షిణదిగ్గమనప్రసిద్ధేః ఇయముత్ప్రేక్షా తథా తద్వత్ ఖంజనేనేవ నీలోత్పలేన అతో హేతోరేతస్యా నేత్రశోభా ప్రాప్త్యర్థం తపః కర్తుమివేత్యర్థః. ప్రతిదివసం న తు కదాచిత్ అప్సు జలేషు మగ్నం తథా తద్వత్ ఖంజన

